


దామోదరం అతడి కొత్తభార్యా నన్నలా బెదరించి అవమానించి వుండకపోతే.

"నేను సర్వనాశనమే కావచ్చు - కాని కక్ష తీర్చుకోవాలనే ప్రతిజ్ఞపట్టాను. అందుకే త్రాగుబోతూ నీతినియమాలు లేనివాడూ అయిన ఆ యింటి యజమాని నుండి నన్ను నేను రక్షించుకోవాలనే ప్రయత్నమే చేయలేదు. సవితాబెనర్జీ ద్వారా దామోదరం ఇంటి యజమానురాలి మనసులో విషం కురిపించాడు. ఫలితంగా ఆమె నాకు ఉద్వాసన చెప్పింది. కానీ యజమానిమాత్రం రహస్యంగా నన్ను వేరేయింట వుంచాడు. కొన్ని రోజులకు అతడే నన్నీహోటల్ యజమానికి ఒప్పగించాడు. ఇప్పుడు నా ఆరాధకు లెందరో!

"పరువుగా బ్రతకాలంటే కష్టం కానీ ఇలాంటి జీవితానికి ఎంత సుఖమో! తర్వాత ఏ నరకానికైనా పోనీండి, ఫర్వాలేదు. దామోదరంపై కక్ష తీర్చుకున్నాను చూశారా? నేనే మీకందరికీ ఆహ్వానాలు పంపింది. నా అదృష్టంకొలదీ అందరూ వచ్చారు. ముఖ్యంగా దామోదరం కొత్తభార్యతో వచ్చాడు. 'మహా ప్రొఫెసర్ని కనుక ఎవరో ఇంత ప్రత్యేకంగా ఆహ్వానించారనీ విర్రవీగుతూ వచ్చినట్లున్నాడు పాపం. నన్ను గుర్తుపట్టాడు - ఎలాగ? మీ అందరి సమక్షంలోనూ. అదే నాకు కావాలి. ఇప్పుడేమైంది అతడి పరువు? నన్నీఊళ్లో వుండనీయనన్నాడు కదూ? ఇప్పుడు తనెలా వుంటాడిక్కడ? 'నా చుట్టూ ఎంత బలగం

ఇప్పుడు? నన్నతడేమీ చేయలేడు. 'ఇది దామోదరం పెళ్ళాంరా' అంటాడు చూసిన ప్రతివాడూ! నన్నత డనుభవింపజేసిన నరకయాతనకు ప్రతిఫలం ఈ చిత్రహింస. పాపపుణ్యాల సంగతి నే నాలోచించను ఇక. ఈ అవమానం వాడొక్కడిదేకాదు, ఆ కొత్తభార్యకూ, తల్లిదండ్రులకూ, తోబుట్టువులకూ, ఇంటిమొత్తానికే అవమానం. నిష్కారణంగా అన్యాయానికి గురైన నా వంటి అభాగినులంతా ఇలాగే తమ తమ జీవితాలను బలిదానం కావించుకొంటేనే కానీ ఈ అభినవ నరకాసురుల పీడ తగ్గదు; శూర్పణకల పొగరు అణగదు.

"మీరు నన్ను క్షమించినా క్షమించకపోయినా అర్థంచేసుకోగలరు నా ఎద, లోని దావానలాన్ని. అందుకే యింత వివరంగా నా స్థితిని విశదపరచు కున్నాను. నా బ్రతుకు హీనమైపోయిందని నాకు తెలుసు. నాకు కుక్కచావే ప్రాప్తించవచ్చు. కానీ ఆఖరుక్షణాన మాత్రం మిమ్మల్నే- నా దీనదశలో ఆదుకున్న మిమ్మల్నే తలచుకుంటాను అక్కయ్యగారూ. ప్రస్తుతం నేను కొత్త తులసిని. మరణించిన పాత తులసి కొరకై సానుభూతితో నిండుమనస్సుతో ఓ కన్నీటిచుక్క రాల్చగలరు కదూ?

"ఈ విధంగా బ్రతుకుతూన్న నేను ఇక మీ యింట అడుగుపెట్టే అర్హత కోల్పోయానని తెల్సు. అందుకే ఈ లేఖ. ఇంకెప్పుడూ యిలా విసిగించను. సెలవు.

"జియాజీకి నమస్కారాలు. చిరంజీవులకు నా ముద్దులు.

—తులసి"





# నలుగురు ఫకీర్లు

(గతసంచిక తరువాయి)

## 6

### రెండవ ఫకీరు కథ

**త**న వంతురాగానే రెండవ ఫకీరు విశ్రాంతిగా కూర్చుని ఇలా చెప్పాడు.

"ఓ ఫకీర్లారా! ఈ దౌర్భాగ్యుడు పర్షియా రాజకుమారుడు. అక్కడ అన్ని విద్యలలోనూ ఆరితేరిన వారున్నారు. అందుకే ఇస్ఫహానును అర్ధ ప్రపంచం అంటారు. సప్తద్వీపాల లోనూ ఆ పురాతన రాజ్యంలాంటి రాజ్యం లేదు. పర్షియా వాతావరణం ఆహ్లాదకరమైనది. అక్కడి ప్రజలు అందంగానూ, నాగరీకులుగానూ ఉంటారు.

ఆ దేశానికి రాజైన నా తండ్రి నాకు పసితనంలోనే మహామేధావులైన శాస్త్ర వేత్తలను ఏర్పాటుచేసి, రాజనీతి నేర్పించాడు. నేను నేర్చుకోవలిసినదంతా నేర్చుకుని, ప్రవీణుణ్ణి అయాను. దేవుడి అనుగ్రహంచేత నాకు పధ్నాలుగేళ్ళ వయసుకే సమస్తశాస్త్రాలూ, సంభాషణాసామర్థ్యమూ, సకల మర్యాదలూ

అలవడి, నేను రాజులకు తెలియదగిన దంతా తెలుసుకున్నాను. అంతేగాక, నేను అస్తమానమూ జ్ఞానుల సాంగత్యం జేస్తూ, అన్ని దేశాల ఇతిహాసాలూ, గొప్ప రాజకుమారుల, మహావీరుల కథలూ తెలుసుకున్నాను.

ఇతిహాస ప్రవీణుడై, ప్రపంచాన్ని విస్తృతంగా చూసిన ఒక జ్ఞాని నాతో ఒకనాడు, "మానవుడి ప్రాణం అశాశ్వతమేగాని, ఒక్కొక్క మానవుడి గుణగణాలు అతని పేరును ఆకల్పాంతం శాశ్వతంగా నిలిపిఉంచుతాయి." అన్నాడు.

నాకు మార్గదర్శకంగా ఉండగలందులకు అలాటివారి ఖ్యాతి గురించి చెప్పమని నేను ఆయనను వేడుకున్నాను. ఆయన నాకు హాతింతాయ్ జీవిత ఘటనలు ఇలా చెప్పాడు:

హాతిం జీవించిన కాలంలో అరేబియాలో నుఫల్ అనేరాజుఉండేవాడు. హాతింకుగల పేరు ప్రఖ్యాతులు విని ఓర్వలేక ఆయన పగపట్టి, తన సైనికులను తరలించుకుని, హాతింమీదికి యుద్ధానికి వెళ్ళాడు. హాతిం సజ్జనుడూ, దైవభీతికలవాడునూ. తాను కూడా యుద్ధానికి తలపడితే అనేకమంది మరణించి, ఎంతో రక్తపాతం జరుగుతుందనీ, ఆ పాపం తనకు చుట్టుకుంటుందనీ అనుకుని హాతిం కట్టుబట్టలతో ఒంటరిగా పారిపోయి, పర్వతాలలో ఉన్న ఒక గుహలో దాక్కున్నాడు.

హాతిం పారిపోయిన సంగతి వినగానే నుఫల్ ఆయన ఆస్తులనూ, ఇళ్ళనూ స్వాధీనపరుచుకుని, హాతింకోసం వెతికి, పట్టుకుని, తనవద్దకు తెచ్చినవారికి అయిదు వందల బంగారు కాసులిస్తానని ప్రకటించాడు. ఈ ప్రకటన విని అందరూ ఆశకు లోనై హాతింకోసం వెతక నారంభించారు.

ఒకనాడు ఒక ముసలివాడూ, అతడి భార్యా, ఇద్దరు ముగ్గురు పిల్లలూ చితుకులు ఏరుతూ గుహసమీపంగా వచ్చారు. హాతిం దాగిఉన్న గుహకు సమీపంగా ఉన్న అడవిలో వాళ్ళు చితుకులు ఏరేటప్పుడు ముసలివాడి భార్య, "నా అదృష్టమే బాగున్నట్టుంటే మనకు హాతిం ఎక్కడోక్కడ కనిపించేవాడు. మనం అతన్ని పట్టుకుపోయి నుఫల్‌కు అప్పగించి, అయిదు వందల బంగారు కాసులూ పుచ్చుకుని, ఈ అగచాట్లనుంచి తప్పించుకుని, నిక్షేపంగా బతికి ఉందుము," అన్నది.

"ఏమిటి నీ పేలుడు ? మనం రోజూ ఇలా పుల్లలు ఏరి, నెత్తిన పెట్టుకునివెళ్ళి బజారులో అమ్మి, ఆ డబ్బుతో రొట్టే, ఉప్పూ కొనుక్కోవాలని మనకు రాసిపెట్టి ఉన్నది. లేదా, ఏదో ఒకరోజు సింహాలు మనని వేసుకుపోతాయి. నోరు మూసుకుని, పనిచెయ్యి. హాతిం మనకు

మా ప్రత్యేక సంచికకు మీ కథ ఒకటి కావాలండీ!
రచన ఎటువంటిదైనా ఫరవా లేదు!! మా పత్రిక
లో మీ పేరు విధిగా వేయాలి!! మాక్కావల్సింది అంతే!!




ఎందుకు చిక్కుతాడు, రాజు మనకు అంత డబ్బు ఎందుకిస్తాడు ?" అన్నాడు ముసలాడు.

ముసలిది నోరుమూసుకుని, పెద్ద నిట్టూర్పు విడిచింది.

హాతిం ఈ సంభాషణ అంతా విన్నాడు. తన ప్రాణం కాపాడుకోవడానికి దాగి ఉండటం పౌరుషహీనమనీ, అనౌదార్యమనీ ఆయనకు తోచింది. ఆ అభాగ్యుల కోరిక నెరవేర్చి, వారికి అదృష్టం కలిగించే అవకాశం తనకు లభించింది. మానవత్వం లేనివాడు మనిషికాడు. దయలేనివాడు కటికవాడు.

అందుచేత హాతిం గుహనుంచి వెంటనే బయటికివచ్చి ముసలివాడితో, "తాన్నా, నేనే హాతింను. నన్ను నుఫల్ దగ్గిరికి తీసుకుపో. ఆయన నీకు ఇస్తానన్నది ఇస్తాడు," అన్నాడు.

ముసలాడు దానికి సమాధానంగా, "నువు చెప్పినట్టుచేస్తే నేను బాగుపడి, లాభంపొందేమాట నిజమే. కాని ఆయన నిన్ను ఏంచేస్తాడో ఎవరికి తెలుసు ? నిన్ను ఆయన చంపేస్తే, అప్పుడు నేనేం చెయ్యాలి ? డబ్బుకోసం కక్కుర్తిపడి నిన్ను ఆయనకు అప్పగించటం నావల్లకాదు. నేనెంతకాలం జీవించబోతాను ఆయన ఇచ్చే సొమ్ము ఎంత కాలం అనుభవించబోతాను ? నేను చివరకు చావాలిసిందే గద; దేవుడికి అప్పుడు ఏంసమాధానం చెప్పుకునేది ?" అన్నాడు.

హాతిం అతన్ని ఎంతగానో బతిమాలుతూ, "నన్ను నీ వెంట తీసుకుపో. అదే నా కోరిక. నా ధనప్రాణాలు లోకులకు ఉపయోగపడాలని నేను ఎప్పుడూ కోరుకుంటాను. అంతకన్న

వాటిని నేను సద్వినియోగం చేసేమార్గం లేదు," అన్నాడు.

కాని హాతింను వెంటబెట్టుకుని వెళ్ళి బహుమానం పుచ్చుకోవటానికి ముసలాడు ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు.

చిట్టచివరకు ప్రాణం విసిగి హాతిం, "నీవు నన్ను తీసుకుపోకపోతే, నేనే రాజువద్దకువెళ్ళి, ఈ ముసలాడు నన్ను కొండగుహలో దాచాడ, అని చెబుతాను," అన్నాడు.

ముసలాడు నవ్వి, "మంచికి అలా చెడు జరిగేపక్షంలో అది నా ప్రారబ్ధం అనుకుంటాను," అన్నాడు.

ఈ సంభాషణ నడుస్తూండగా జనం వచ్చి వారి చుట్టూ మూగారు. వాళ్ళకు హాతిం ఎవరో తెలిసిపోయింది. వాళ్ళు వెంటనే హాతింను పట్టుకుని తీసుకుపోయారు. ముసలివాడు విచారంగా వాళ్ళవెంట బయలుదేరాడు.

వాళ్ళు హాతింను తెచ్చి తనముందు ఉంచినప్పుడు నుఫల్, "ఇతన్ని పట్టుకున్న దెవరు ?" అని వాళ్ళనడిగాడు.

ఒక పనికిమాలిన వదరుబోతువెధవ, "ఇంతపని నేనుగాక ఇంకెవరు చేయగలరు ? ఇది నా ఘనకార్యమే. నా విజయ పతాక ఆకాశంలో ఎగురుతున్నది !" అన్నాడు.

మరొక ధూర్తుడు, "ఇతనికోసం ఎన్నాళ్ళుగానో అరణ్యంలో వెతుకుతూ చివరకు పట్టుకున్నాను. పట్టుకుని తీసుకొచ్చాను. నేను పడ్డ శ్రమ ఆలోచించి, ఆ ఇస్తానన్న బహుమానమే చాలు ఇప్పించండి," అన్నాడు.

ఈ విధంగా వారిలో ప్రతిఒక్కడూ, బంగారంమీది ఆశకొద్దీ, తానే హాతింను పట్టితెచ్చినట్టు చెప్పాడు. దూరంగా నిలబడిఉన్న ముసలాడుమాత్రం హాతింకోసం మౌనంగా విలపించాడు.

అందరూ చెప్పటం అయిపోయాక హాతిం రాజుతో, "మీరు నిజం తెలుసుకోగోరితే నేను చెబుతాను. ఆ దూరంగా నిలబడిఉన్న వృద్ధుడు నన్ను తెచ్చాడు. మీకు చేతనైతే నిజం తెలుసుకుని, నన్ను పట్టుకున్నందుకు ఆయనకు ఇస్తానన్న బహుమానం ఇప్పించండి. ఎందుకంటే శరీరమంతటికీ వాక్కు ప్రధానమైనది. మనిషి నోటపలికినమాట నిలబెట్టుకోవాలి ఎందుకంటే, భగవంతుడు పశువులకు కూడా వాక్కు ఇచ్చిఉన్నట్టయితే మనిషికీ, పశువుకూ తేడా ఏముండేది ?" అన్నాడు

నుఫల్ ముసలాణ్ణి దగ్గిరికి పిలిచి, "నిజం చెప్పు అసలు జరిగిన దేమిటి ? హాతింను పట్టుకొని, ఇక్కడికి తెచ్చిన దెవరు ?" అని అడిగాడు

ముసలాడు మొదటినుంచి చివరదాకా జరిగినది జరిగినట్టు చెప్పి, "హాతిం, నా కోసం తనకు తానే వచ్చాడు," అన్నాడు.

హాతిం సాహసానికి నుఫల్ నిర్ఘాంత

పోయి, "నీ ఔదార్యం ఎంత ఆశ్చర్యకరం! ఇతరులకు మేలుచెయ్యటానికి నీ ప్రాణాన్నికూడా నువు లక్ష్యపెట్ట లేదు!" అన్నాడు.

హాతింను తామే పట్టుకున్నట్టు అబద్ధం చెప్పిన వారందరినీ రాజు పెడ రెక్కలు విరిచికట్టించి, అయిదు వందల బంగారు కాసులకు బదులు, మాడుమీద అయిదేసి వందలు చెప్పుదెబ్బలు కొట్టించాడు.

అబద్ధం చెప్పటాన్ని మించిన నేరం మరొకటిలేదు. చాలామంది అబద్ధాలాడుతారు, కాని దొరికిపోయినప్పుడే శిక్ష పొందుతారు. అలాగే అబద్ధాలకోరులందరూ శిక్ష పొందారు.

అసంఖ్యాకులకు సహాయపడి, కష్టాలలో ఉన్నవారిని ఆదుకునేటందుకు ప్రాణంకూడా ధారపోయ సిద్ధపడిన హాతింవంటి ఉదారుడిపైన పగపెట్టుకోవటం పురుషలక్షణం కాదని నుఫల్‌కు తోచింది. అతను స్నేహపూర్వకంగానూ, సుహృద్భావంతోనూ హాతిం చెయ్యిపట్టుకుని, "నీ వంటివాళ్ళే ఇలా చేయదగుదురు," అన్నాడు. ఆయన హాతింను గౌరవపురస్సరంగా తన చెంత కూర్చోబెట్టుకుని, ఆయన ఆస్తిపాస్తులన్నీ ఆయనకు తిరిగి ఇచ్చేసి, తాయీ తెగకు ఆయనను నాయకుడుగా ప్రకటించాడు. ఆయన బహూకరించిన అయిదు వందల బంగారు కాసులూ తీసుకుని ముసలివాడూ, అతనిభార్యా సెలవు పుచ్చుకున్నారు.

నేను హాతిం ఔదార్యం గురించి విని సిగ్గుపడ్డాను. హాతిం ఒక అరబ్బుజాతికి మాత్రమే నాయకుడు ఆయన చూపిన ఒక్క ఉదారాన్నీ ఈనాటిదాకా ఇంకా చెప్పుకుంటూనే ఉన్నారు నేను దైవ నిర్ణయంవల్ల పర్షియాకంతటికీ రాజును. నేను కూడా అంతటి కీర్తి సంపాదించక పోవటం నగుబాటు. ఈ ప్రపంచంలో ఈవినిమించినది లేదనటానికి సందేహం లేదు. ఈ లోకంలో పెట్టినవాడికే పైలోకంలో పుట్టుతుంది విత్తునాటిన వాడికి ఎంత ఫలమైనా ఉంటుంది.

ఇలాటి భావాలు నా మెదడులో నాటుకోగా, వాస్తుశాఖామాత్యుణ్ణి పిలిచి, నగరం వెలపల, సాధ్యమైనంత త్వరలో నలభై విశాలద్వారాలుగల హర్మ్యాన్ని గొప్పగా నిర్మించమని ఉత్తరువిచ్చాను నాకు కావలిసిన మహాభవనం త్వరలోనే నిర్మాణమయింది. నేను రోజూ అక్కడికి వెళ్ళి, పేదసాదలకు వెండిబంగారాలు దానంచేస్తూ వచ్చాను. ధర్మం అడిగిన వారికి అడిగినంతా ఇస్తూవచ్చాను. రోజూ ఇబ్బందిలో ఉన్నవాళ్ళు నలభై ద్వారాలకుండా వచ్చి, తాము కోరినది పొందుతూ వచ్చారు.

ఒకనాడు ఒక ఫకీరు ముఖద్వారం నుంచివచ్చి బిచ్చం అడిగాడు. అతనికి ఒక బంగారు కాసు ఇచ్చాను. అతనే

మరొక ద్వారంకుండావచ్చి, రెండు బంగారుకాసులు అడిగాడు. నేను అతన్ని గుర్తించి కూడా, పోనిమ్మనుకుని రెండు కాసులు ఇచ్చాను. అతను అలా ప్రతి ద్వారంనుంచీ వచ్చి, వచ్చినప్పుడల్లా ఒక్కొక్క కాసు హెచ్చుఅడుగుతూ వచ్చాడు. నేను అతని చర్య గమనించి నట్టు కనబడకుండా అతను అడిగినవి ఇచ్చాను. చిట్టచివరకు అతను నలభయ్యో ద్వారంనుంచి వచ్చి నలభై కాసులు అడిగాడు. ఆ మొత్తం అతనికి ఇప్పించాను.

అంతా తీసుకుని కూడా అ ఫకీరు తిరిగి మొదటి ద్వారంనుంచి వచ్చి మళ్ళీ బిచ్చం అడిగాడు. అతని ప్రవర్తన నాకు చాలా ధూర్తంగా కనబడి, "ఓ ఆశాపాతకుడా, నువు ఏమన్న ఫకీరువు? ఫకీరు అన్నమాటకు అర్థంకూడా నీకు తెలీదే!" అన్నాను.

"ధర్మదాతా, ఆ అర్థం నువే చెప్పు," అన్నాడతను.

"ఫకీరు ఉపవాసాలు చేసేవాడు; ఓర్పుగలవాడు; భక్తిగలవాడు. ఈ మూడు గుణాలూ లేనివాడు ఫకీరు అనిపించుకోడు. ఇప్పటికే నీకు చాలా ముట్టింది. అదిపెట్టి తాగు తిను. అది అయిపోయాక, నా వద్దకు తిరిగివచ్చి, నీకు కావలిసినది పుచ్చుకుపో. నేను చేసే ఈ ధర్మం నీ సత్వరావసరాలు తీర్చటానికేతప్ప నిలవవేసుకోవటానికి కాదు. లుబ్ధుడా, నలభై ద్వారాల కుండానూ నీకు ఒకటినుంచి నలభై బంగారు కాసులదాకా ముట్టింది మొత్తం ఎన్ని ముట్టినదీ కూడిచూసుకో. ఇంత ముట్టినా నీ ఆశ చావక మళ్ళీ మొదటి ద్వారంకుండా వచ్చావు. ఇంత డబ్బు ఏంచేసుకుంటావు? నిజమైన ఫకీరు ఆ రోజు అవసరాలుమించి ఆలోచించరాదు. మర్నాడు విశ్వదాత (దేవుడు) కొత్త సదుపాయాలు చూపుతాడు. సిగ్గుపడు, ఓర్పు వహించు, తృప్తిచెందు. ఇదేమి ఫకీరు జీవనం?" అన్నాను.

ఈ మాటలు విని అతను చిరాకుపడి కోపం తెచ్చుకుని, తాను తీసుకున్న డబ్బంతా కింద విసిరేసి, "చాలించండి! అంత ఆగ్రహం అనవసరం. మీ దానం మీరే పుచ్చుకోండి. కాని ఎన్నడూ దాతృత్వం అనే మాట మాత్రం ఉచ్చరించవద్దు. దాతృత్వం చాలా కష్టమైనది. దాతృత్వభారం మొయ్యలేకుండా ఉన్నారు, మీరు దాత అనిపించుకునే దెప్పుడు? దానికి మీరింకా చాలా దూరంలో ఉన్నారు దాత లక్షణాలు ముందు తెలుసుకుని ఆచరించండి," అన్నాడు.

ఈ మాటవిని ఆందోళనపడి, నేనా ఫకీరును ఆ మాటకు అర్థం చెప్పమని అడిగాను.

"సామర్థ్యమూ, దైవభీతీ, ఆత్మవిమర్శ – ఈ మూడూ లేనివాడు దాత




అనిపించుకోడు. దాత అయిన వాడు తనలో ఇంకా ఇతర లోపాలు ఎన్ని ఉన్నా దాతృత్వంద్వారా దేవుడికి ప్రీతిపాత్రుడు కాగలిగినందుకు ఆనందిస్తాడు. నేను అనేక దేశాలు తిరిగాను. కాని ఒక్క బస్రా రాజకుమార్తెలో తప్ప నేను నిజమైన దాతృత్వం చూడలేదు. దేవుడి అనుగ్రహం ఆమెపైన పూర్తిగా పడింది. ఇతరులకు దాత అన్న పేరే కావాలికాని, ఆచరణ అవసరం లేదు,'' అన్నాడు ఫకీరు.

ఈ మాట విన్న మీదట నేను ఫకీరును అతనికి కావలసిందంతా పుచ్చుకోమన్నాను. అతను నా మాట తోసిపుచ్చి, "ఇప్పుడు నువు నీ రాజ్యమంతా ఇచ్చినా దానిమీద ఉమ్మేయ్యను!" అంటూ వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోయాడేగాని, బస్రా రాజకుమారిని గురించి అతను చేసిన ప్రశంస నా హృదయంలో ఆందోళన లేపి, శాంతి లేకుండా చేసింది. నాకు బస్రా వెళ్లాలనీ, ఏదోవిధంగా ఆమెను చూడాలనీ కోరిక కలిగింది. ఈలోపల రాజుగారు మరణించటం చేత, నేను రాజ్యాభిషేకం చేసుకుని, సామ్రాజ్యానికి ఏలికనయాను, కాని బస్రా వెళ్ళాలనే కోరిక అలాగే ఉండిపోయింది. ఈ విషయమై ప్రధానితోనూ, సామ్రాజ్యానికి ఆధారభూతులైన ప్రముఖులతోనూ సంప్రతించాను. వారితో, "నేను బస్రాకు ప్రయాణమవుదామనుకుంటున్నాను. మీరు మీమీ పనులు సావధానంగా చూసుకోండి ప్రయాణానికి ఎక్కువ కాలం పట్టదు. బతికిఉంటే త్వరలోనే తిరిగివస్తాను,'' అన్నాను.

నేను వెళ్ళటం ఎవరికీ ఇష్టమైనట్టు

కనబడలేదు. నాకుకూడా అప్పుడే విచారం పట్టుకున్నది. మార్గాంతరంలేక, నేను ఒకనాడు సమర్థుడైన వజీరును పిలిపించి, నా స్థానంలో అతన్ని రాజప్రతినిధిగా నియోగించి, సామ్రాజ్యపాలన కంతటికీ అధిపతిని చేశాను.

అప్పుడు నేను ఫకీరువేషం ధరించి యాత్రికుడి దుస్తులు వేసుకుని, ఒంటరిగా బస్రారోడ్డు పట్టుకున్నాను. కొద్దిరోజుల లోనే నేను బస్రా సరిహద్దు చేరుకుని, ఒక చిత్రం గమనించాను. నేను రాత్రికి ఆగినచోట రాజుపుహోరి భటులు నాకు ఎదురవచ్చి, నాకు చక్కని ఇంట బస ఏర్పాటుచేసి, నేను తినటానికి కావాలన్న పదార్థాలు కొల్లలుగా తెచ్చి నా ముందు పెట్టారు. రెండవ మజిలీ దగ్గరకూడా ఇలాగే జరిగింది. నా ప్రయాణమంతటా కూడా నాకు ఇలాంటి అనుభవమే తటస్థించింది.

చివరకు బస్రా చేరాను. నేను నగరం లోకి అడుగుపెట్టానో లేదో, ఒక యువకుడు మంచి దుస్తులు ధరించి, విన యంగా మాట్లాడుతూ నన్ను సమీపించి "నేను యాత్రికుల సేవకుణ్ణి నగరం లోకి వచ్చే ప్రయాణీకులనూ, యాత్రీకు లనూ ఇంటికి చేర్చటం నా పని. కొత్త వారు బసచెయ్యటానికి ఈ నగరంలో నా యిల్లుతప్ప మరో చోటు లేదు. అయ్యా, దయచేసి మా యిల్లు పావనం చెయ్యండి," అన్నాడు.

నేను అతని పేరు అడిగి, ఖుదీర్ బఖ్త్ అని తెలుసుకున్నాను. అతని వాలకమూ మర్యాదా చూసి, నేను అతనివెంట అతని ఇంటికి వెళ్ళాను. అది ఒక రాజభవనం లాగుంది. అతను నన్ను ఒక దివ్యమైన గదికి తీసుకుపోయి, అక్కడ కూర్చో బెట్టి, నేను కాళ్ళూ చేతులూ కడుక్కోవ టానికి వెచ్చని నీరు తెప్పించాడు. నాకు రకరకాల వంటకాలు వడ్డించి, బోలెడన్ని పళ్ళూ, మిఠాయీ నాముందు పెట్టారు. అవన్నీ చూస్తేనే నా ఆకలి తీరింది. అన్నీ కొంచెం కొంచెం రుచి చూసేసరికి కడుపు నిండిపోయింది.

నేను తినటం పూర్తిచెయ్యటం చూసి ఆ యువకుడు, "అయ్యో, తమరు ఏం తిన్నారు? వడ్డించినవన్నీ అలాగే ఉండి పోయాయే! మొహమాటపడక ఇంకా తినండి," అన్నాడు నన్ను బలవంతం చేస్తూ.

"తిండిదగ్గర మొహమాటం దేనికి? మీ యిల్లు చల్లగా పొట్ట పట్టినంతా తిన్నాను. వంటకాలు ఎంత బాగున్నాయో చెప్పలేను. వాటి రుచి అద్భుతం. వీటిని తీసేయించండి," అన్నాను.

నేను చెయ్యీ ముఖమూ కడుక్కోవ టానికి బంగారుపాత్రలో వెచ్చని నీరూ, పళ్లెమూ, సువాసనగల సబ్బూ తెచ్చారు. తరవాత రత్నాలుపొదిగిన పాన్దాన్‌లో ఆకులూ, సుగంధద్రవ్యాలూ తెచ్చారు. నేను తాగటానికి నీరు అడిగినప్పుడల్లా



మంచుముక్కలు వేసిన చల్లని నీరు ఇచ్చారు.

సాయంకాలమయింది. కర్పూరదీపాలు వెలిగించారు. ఆ యువకుడు నా చెంతనే కూర్చుని, నన్ను తన సంభాషణతో రంజింపజేశాడు. రాత్రి మూడు జాములు గడిచాక అతను నన్ను పడుకోమని చెప్పి, ఒక పందిరిపట్టెమంచం చూపించాడు.

"అయ్యా, మా యాత్రికులు పడుకోవటానికి ఒక చాపగాని, అజినం (చర్మం) గాని చాలునే. ఈ సుఖాలు లౌకికులకు దేవుడు ఏర్పాటుచేసినవి." అన్నాను.

"ఇక్కడ ఉన్నవన్నీ యాత్రికుల కోసమే. నాకోసం కాదు" అన్నాడతను.

అతని ప్రోద్బలంమీద నేను మంచం మీద పడుకున్నాను. పక్క గులాబీల

కన్న మెత్తగా ఉన్నది. గులాబీల తొట్టెలూ, పువ్వులగంపలూ మంచానికి రెండుదిక్కులా పెట్టిఉన్నాయి. ముసాంబవం వగైరా పరిమళద్రవ్యాల ధూపం ఉన్నది అన్ని వైపులనుంచీ సువాసనలు వస్తూ ఉండగా నేను నిద్రపోయాను. ఉదయం కాగానే నాకు పళ్లవరుసలూ షర్బతులూ ఆహారంగా ఇచ్చారు.

ఇలా నేను మూడురాత్రులూ, మూడు పగళ్ళూ వైభవంగా గడిపి, నాలుగోనాడు వెళ్ళివస్తానని చెప్పాను. ఆ యువకుడు చేతులు జోడించి: "నేను చేసే సత్కారాలలో ఏదో లోపం జరిగి వుంటుంది. అసంతృప్తి కలిగి మీరు వెళ్ళిపోతామంటున్నారు," అన్నాడు.

నేను ఆశ్చర్యపోయి, "ఇవేమన్న మాటలు! ఆతిథ్యం మూడునాళ్ళు మించరాదు. నేను ఆ గడువు పూర్తిచేశాను. అదీగాక నేను ప్రయాణం సాగించాలి. ఒకచోటనే ఎక్కువకాలం ఉంటే నా యాత్ర ముగియదు. అందుచేత మీనుంచి సెలవు వేడుతున్నాను. లేకపోతే మీ ఆతిథ్యం స్వీకరిస్తూ ఎల్లకాలం ఉండిపోవాలనే ఉన్నది," అన్నాను.

అతను ఇలా అన్నాడు. "సరే, మీ ఇష్టం. కాని క్షణం ఆగండి. నేను పరిస్థితులన్నీ రాజకుమార్తెకు చెప్పివస్తాను. అంతేకాదు, మీరు వెళ్ళిపోతామంటున్నారు-గనక, మీ ఆనందంకోసం సమకూర్చిన వస్తుజాలమంతా మీరుపట్టుకుపోవాలి. అవి ఇప్పుడు మీసొత్తు, వాటిని తీసుకుపోయే ఏర్పాటుకూడా మేమే చూస్తాం."

"అలా అనకండి. నేను యాత్రికుణ్ణే గాని, గతిలేని బిచ్చగాణ్ణికాను నాకీ వస్తువాహనాలే కావలసిఉంటే యాత్రికుణ్ణి కావటం దేనికి? ఐహికవస్తువుల మీద నాకు ఆశఉంటే అవి చెడ్డవని వాటిని విసర్జించి ఉందునా?" అన్నాను.

"మీరు నిరాకరించారని వింటే రాజకుమార్తె నన్ను ఉద్యోగంనుంచి తొలగిస్తుంది. ఇంకా ఏమి శిక్ష అనుభవిస్తానో దేవుడికే తెలియాలి. మీకా వస్తువులు అవసరం లేకపోతే, వాటన్నిటినీ ఒక గదిలో పెట్టి, గదికి సీలువెయ్యండి. తరవాత వాటిని మీ ఇష్టం వచ్చినట్టు చేసుకోవచ్చు," అని ఆ యువకుడు అన్నాడు

నేనందుకు ఒప్పుకోలేదు. అతనువదిలిపెట్టలేదు. చివరకు నేను ఆ వస్తువులన్నీ ఒక గదిలో పెట్టి, గదికి నా సీలువేసి, వెళ్ళిపోవటానికి అనుమతికోసం ఆత్రంగా ఎదురుచూశాను.

ఈ లోపల ఒక కొజ్జావాడు నా దగ్గిరికి వచ్చాడు అతను మంచి దుస్తులు ధరించి, చేతిలో బంగారుబెత్తం పట్టుకుని ఉన్నాడు. అతనివెంట అనేకమంది అందమైన నౌకర్లు తాము నిర్వర్తించే విధుల చిహ్నాలు ధరించి ఉన్నారు. అతను ఎంతో వినయమూ, మంచితనమూ ఉట్టి



పడేలాగా, "అయ్యా, తమరు నాయందు అనుగ్రహం ఉంచి మా పేద ఇంటిని పావనం చెయ్యవలసిందిగా వేడుకుంటు న్నాను ఎవరో బాటసారి వచ్చాడనీ, ఆయనకు ఎవరూ తగిన మర్యాదలు చేయలేదని రాజకుమార్తెకు తెలియ వచ్చు. ఆ బాటసారి ఎలా వచ్చాడో అలాగే వెళ్ళిపోయాడంటే ఆమె నన్ను ఎలా శిక్షిస్తుందో దేవుడికే తెలియాలి నా ప్రాణానికే ఎసరు రావచ్చు," అన్నాడు.

నేను ప్రార్థనలు విని, అతని ఆతిథ్యం స్వీకరించటానికి ఎంతమాత్రమూ ఇష్ట పడలేదు. కాని అతను నా మెడవంచి ఒప్పించి, నన్ను తన యింటికి తీసుకు పోయాడు. అది మొదటిదానికన్న గొప్పగా ఉన్నది.

మొదట ఆతిథ్యం ఇచ్చిన వాడిలాగే ఇతను కూడా నాకు మూడురోజులపాటు అద్భుతంగా జరిపి, తరవాత బంగారు, వంటసామగ్రీ, తివాసీలూ ఇంకా ఇతర వస్తువులన్నీ నావే కానీ; వాటిని నా యిచ్ఛానుసారం చేసుకోవచ్చుననీ అన్నాడు ఆ మాటలు విని నాకు మతి పోయింది. ఎలాగైనా చెప్పకుండా వెళ్ళి పోవాలనిపించింది.

నా కంగారుచూసి ఆ కొజ్జా, "అయ్యా! మీకు ఏ అవసరాలూ, కోరికలూ ఉన్నా నాతో చెప్పండి. నేను రాజకుమార్తెకు తెలియబరుస్తాను," అన్నాడు.

"యాత్రికుడి వేషంలో ఉండి, నేను కోరకుండానే మీరు ఇస్తున్న ఈ ఐహిక సంపదను ఎలా స్వీకరించను? నా వల్ల కాదు," అన్నాను

"ఐహికవస్తువుల మీది కాంక్ష ఎవరినీ వదలదు. యాత్రలు చేసేవారున్నారు, జడలు పెంచినవారున్నారు, తలలు గొరిగించుకున్న వారున్నారు, బూడిద పూసుకున్న వారున్నారు, కాని కాంచనతృష్ణ లేనివారు కానరారని కవి అన్నాడు," అన్నాడతను.

"అదంతా నిజమే. కాని నాకు గల ఒక్క కోరికా ఏమంటే, రాణిగారిని ఒకటి అడగాలి. ఆ విషయం ఆమెకొక చీటి రాస్తాను. దాన్ని ఆమెకు అందించినట్టయితే, ప్రపంచంలో ఉన్న సంపద అంతా లభ్యమయినంత ఆసంచం పొందుతాను," అన్నాను.

"ఆ పని సంతోషంగా చేస్తాను అందులో కీడేమీ లేదు."

నేను వెంటనే ఒక లేఖ రాశాను. అందులో నేను నా పరిస్థితి అంతా వివరించి, నేను ఆ నగరంలో పొందిన అతిథిసత్కారాలను ప్రశంసించి, ఆమె దాతృత్వం నేను విన్నదానికన్న నాలుగింతలు గొప్పగా ఉన్నదని చెప్పి, "మీ మనుషులు నా కోరికను మీకు విన్నవించమన్నారు అందుచేత నేను కపటం లేకుండా నా హృదయ వాంఛ మీకు తెలుపుతున్నాను. నాకు ఐహిక సంపదకు లోటులేదు. నేను ఒక దేశాన్ని పాలించే రాజును. నేను మీ దర్శనం కోరి అష్టకష్టాల కోర్చి, ఒంటరిగా బయలుదేరి ఇలా వచ్చాను. మీరు అనుగ్రహించి నా కోరిక తీర్చగలరని ఆశిస్తున్నాను. దానితో నేను తృప్తిపడతాను. అంతకుమించి మీరు నన్ను అనుగ్రహిస్తే మంచిదే. కాని ఈ దీనుడి కోరికకు ఆదరం జరిగేపక్షంలో నేను ఇలాగే సంచారం చేస్తూ, మీపైన గల హృదయ వాంఛకు బలి అయి, మజ్నూ, షక్‌హాద్ లాగా నా మోహాన్ని ఏ అరణ్యంలోనో, ఏ కొండమీదనో అంతంచేసుకుంటాను," అని ముగించాను.

ఈ విధంగా నా కోరికను తెలుపుతూ ఉత్తరం రాసి కొజ్జాకిచ్చాను అతను దీన్ని రాజకుమార్తెకు అందజేశాడు అతను త్వరలోనే తిరిగివచ్చి నన్ను అంతఃపురంలోకి తీసుకుపోయాడు. అక్కడ నేను ఒక గౌరవనీయురాలైన వృద్ధస్త్రీని చూశాను. ఆమె రత్నాభరణాలు ధరించి, ఒక బంగారుపీటమీద కూర్చొని ఉన్నది. ఆమె ఎదట చేతులు కట్టుకొని మేలిదుస్తులుధరించిన కొజ్జాలూ, నౌకర్లూ అనేకమంది నిలబడి ఉన్నారు. రాజకుమార్తె మందిరంలో ఆమె ప్రధానాధికారిణి అని గ్రహించి, ఆమెకు వందనం చేశాను. ఆమె నాకు ప్రతినమస్కారం చేసి, నన్ను కూర్చోమని అర్థించి, "స్వాగతం, రాజకుమార్తెకు ప్రేమ పూర్వకంగా లేఖ రాసినది నువేకదూ?" అన్నది. నేను సిగ్గుపడి, తల వంచుకుని, మౌనంగా ఉండిపోయాను.

కొంచెం ఆగి ఆమె, "యువకుడా, రాజకుమార్తె నీకు తన సలాము పంపి ఇలా చెప్పమన్నది. 'నేను పెళ్లాడటంలో



అనుచితమేమీలేదు. నువు నన్ను కోరావు, కాని నువు రాజునని చెప్పుకోవటమూ, ఈ సాధుదళాలు కూడా నీ రాజరికాన్ని స్మరించటమూ, అందుగురించి గర్వ పడటమూ అనుచితం. ఎందుకంటే, మనుషులంతా నిశ్చయంగా ఒకటే. మహమ్మద్ మతాన్ని అనుసరించే వారికి హెచ్చు గౌరవం చూపితే చూపవచ్చు. పెళ్ళాడాలనే కోరిక నాకుకూడా చాలా కాలంగా ఉన్నది. నీకు ప్రాపంచిక విషయాలపట్ల ఉన్నట్టే, దేవుడి దయవల్ల నాకుకూడా నిర్లిప్తత ఉన్నది. అయితే నా వివాహానికి ఒక షరతు ఉన్నది. ఆ షరతు నువు పూర్తి చెయ్యవలసి ఉంటుంది" అని చెప్పింది.

"నేను అన్నిటికీ సిద్ధంగానే ఉన్నాను. నా ఐశ్వర్యాన్నిగాని, ప్రాణాన్నిగాని లక్ష్యం చెయ్యను. ఏమిటా షరతు?" అని అడిగాను

"ఇవాళ ఇక్కడ ఉండు. రేపు చెబుతాను," అన్నది వృద్ధస్త్రీ. నేను సరేనని, సెలవు పుచ్చుకుని వచ్చేశాను.

(సశేషం)




అద్దం ముందు ఆనందరాఘ నుంచుని ఆరాటపడుతున్నాడు. మొహం చిట్లించుకుంటూ విసుక్కుంటున్నాడు. తాను కోరుకున్న రూపం అద్దంలో కనపడటంలా. కనుబొమ్మలు పైకి కిందకు తిప్పుతూ, మెడ కుడివైపుకు కొంచెం వంచి 'ఆ' అనుకుంటున్న సమయంలో, అద్దంలో భార్యను చూసి ఉలిక్కిపడ్డాడు.

'నన్ను చూసి అంత భయపడ్డారేంటి...' పకపక నవ్వేసింది శారద

చేతిలో దువ్వెనను విసురుగ గిరాటు పెట్టేశాడు. చిరాకుగా తన వెనకాత్తే నిలబడ్డ భార్య వాలకాన్ని, ఓరచూపుతో తిలకిస్తున్నాడు. ఆనందరావు దృష్టి కోణం అప్రయత్నంగా అమాంతం ఒక టొచ్చి, శారద కంట్లో గుచ్చుకుంది. ఆమె చిరాలుస, యింకొక అడుగు ముందుకు వేసి, భర్త మొహంలోకి చూస్తూ కొంటెగా నవ్వింది. అతనికి అహం బాగా

దెబ్బతిన్నది. 'ఊఊ' అంటూ బుసలు కొడుతున్నాడు. క్షణకాలం తీవ్రంగా చూశాడు. చప్పున, పైపళ్లతో క్రింది పెదిమను గట్టిగా నొక్కుతూ కుడిచేతి చూపుడు వేలును, పాపిడిలోకి పోనిచ్చి, బొటనవేలు సహాయంతో, ఓ పొడుగాటి తెల్లటి వెంట్రుకను కుదుళ్లు కదిలేటట్లు పైకిలాగేశాడు. దాన్ని అద్దంలో వూగిస్తూ తలవూపాడు, విజయ గర్వంతో. శారదకు నవ్వాగలేదు.

'ఎందుకూ అంత నవ్వూ' అంటూ భార్యవైపుకు తిరుగుదామనుకుని, వెంటనే ఆగిపోయి, ధీమాగా నిలబడి, యింకెక్కడయినా, నీకగ్నిపిస్తే చెప్పు అన్నాడు కసిగా.

'తెల్లజుట్టే అనుకున్నా, దృష్టిలోపం కూడా వచ్చిందన్న మాట...' విరగబడి నవ్వింది శారద.

'ఇంకెక్కడయినా వున్నాయేంటి' అని మనస్సులో అనుకుంటూ జుట్టంతా పీక్కున్నాడు. 'వెండితీగలు' అక్కడక్కడ బాగానే కనిపించినాయి. అక్కసు పట్టలేకపోయాడు. అటూ యిటూ మెడ విసురుగా తిప్పి గభాలున బ్రిల్‌క్రీమ్ యింత చేతిలో వేసుకుని, తలంతా మర్దనచేసుకున్నాడు. తమాయించుకుని, నాజూకుగా జుట్టును అదుపులోకి తీసుకొచ్చాడు. మెత్తగా నల్లగా జుట్టు ఒదిగి ఒదిగి పడుకునివుంది. తలను ఊగిస్తూ, అద్దంలో చూసుకుంటూ అమ్మయ్య అని సంతృప్తిగా నవ్వుకున్నాడు.

శారద, ఆట్టే భర్త చేష్టలన్నీ చూస్తూ, అట్లాగే నిలబడిపోయింది.

'ఇంతకీ, మిమ్మల్ని నవమన్మథులని జనం అనుకుంటున్నారని మురిసిపోతున్నారన్నమాట. అంతేగా...'

ను వ్యాహిస్తున్నట్లు, ముసలివాడని మాత్రం అనుకోవడంలేదు, తెలిసిందా..' విశ్వాసంతో భార్య మొహంలోకి చూశాడు.

ఇంతలోకే 'తాతయ్యా...' అంటూ సన్నటి గొంతుక ఆనందరావుకు వినిపించి గతుక్కుమన్నాడు.

'వీడెవడు, తాతయ్యా అంటూ బయద్దేరాడు. ఎన్నిసార్లు చెప్పినా బుద్ధిలేదు. బావ, మావయ్యా, అన్నయ్యా, బాబాయి, యిన్ని వరసలుండే, వీటన్నింటిని వదిలిపెట్టేసి, తాతయ్యా, తాతయ్యా అంటాడేమిటి. వీడి వరస మండిపోను' లోపల లోపల సణుక్కుంటూ, పళ్లు పటపట మనిపించాడు ఆనందరావు.

'ఏమిటి నన్ను సమాధానం చెప్పమంటారా మీ ప్రశ్నకు...లేకపోతే ఆ పిలుపును మీరు వినలేదని నన్ను అనుకోమంటారా...' చిరునవ్వుతో, శారద మొహం కళకళలాడింది.

'వెధవ వరసలు, వాటికి అర్థం యేమిటి! ఆ లెక్కప్రకారమయితే, నిన్నా, మొన్నా పుట్టినవాడు కూడా తాతయ్యే అవచ్చు కూడా...అయినా, వాణ్ణసలు, నన్ను 'యెప్పుడు అట్లా పిల

వద్దని చెప్పానే...ఓహో యిప్పుడు తెలిసిందిలే. నువ్వాడిన నాటకం అన్న మాట...'

'ఇది మరీ బాగుంది. ఇందాకటినుంచి నే యిక్కడే వున్నాగా, నేనేం చేశానని మధ్య...'

'ఈ మాత్రం నే కనిపెట్ట లేనను కున్నావా...'

'అయితేనే, ముందరే వాడికి చెప్పి, మిమ్మల్ని తాతయ్యా అని పిలవమన్నా నన్నమాట. అంతేగా మీ ఊహ...ఒరేయ్ వాసూ యిట్రారా... ఆడగండి...' శారదకు బాగా కోపం వచ్చింది.

'అమ్మమ్మా ... మా అమ్మే...' అంటూ వాసు తడబడుతుంటే, ఆనందరావు పెద్ద పెట్టున బిగ్గరగా నవ్వాడు.

'ఎందుకూ అంత విరగబడటం. అయ్యయ్యో... కాస్త అట్టే పెట్టుకోండి...'

'అమ్మమ్మే... నువ్వు నిజంగా అమ్మమ్మవే...తిక్క కుదిరింది...' ఆనందరావుకు నవ్వాగటంలేదు.

'అందుకా, మీరు నవ్వేది...' యిప్పుడు తెలిసింది... నిలువుగా తల వూపుతూ ధీమాగా భర్తవంక చూస్తూ 'ఓరేయ్ వాసూ, నేను అమ్మమ్మనవుతే, యీ యనగారు యేమవుతార్రా...' వాసును దగ్గరకు తీసుకుంది.

'తాతయ్యా...' నాలికను రెండుసార్లు కదిల్చించాడు వాసు.

గభాలున నవ్వాపేశాడు ఆనందరావు.

వాసు చెయ్యి పట్టుకుని, పకపక నవ్వుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

ఆనందరావు కనిపెట్టలేకపోతున్నాడు. 'నన్ను ఉడికించటానికి శారద అట్లా చీటికి మాటికి అంటోందా లేకపోతే నిజంగానే నేను ముసలివాణ్ణయి పోయానా.' ఛీ ఏంకాలేదు. తనలో సమాధాన పడి చప్పున ఆగిపోయాడు

అవునూ యేళ్లొచ్చిన మాటవుతే నిజమే, కాని యింకా ముసలి కళ పడలేదు. జుట్టు నెరవటానికేమిటి, యీ రోజుల్లో పదేళ్ల కుర్రాడిక్కూడా జుట్టు నెరుస్తోంది. దాంట్లో యేముందిలే. మొహంలో ముడతలు యేంలేవు. బుగ్గలవుతే లొట్టపోలేదు. కళ్లకూడా అట్టే లోతుగా పోనట్టే స్నో రాసింతర్వాత మొహంలో చాలా మార్పు వచ్చేసింది. పౌడరుకూడా లైట్‌గా అద్దితే, ఖచ్చితంగా యిరవైయేళ్ళు వెనక్కి నడిచినట్లు స్పష్టంగా కనిపిస్తోంది. పెళ్లినాటి ఫోటో పక్కన పెట్టుకుని చూస్తుంటే పెద్దగా అట్టే తేడా కనిపించటంలా. ఈ క్రాఫ్ కొంచెం పొడుగ్గా వుంటే బాగుండేది. ఈ వెధవ బట్టతల ముందుకే రావటం మూలాన. షేవ్ కొంచెం దెబ్బతిన్న మాటవుతే వాస్తవమే. బట్టతల కూడా కనిపించకుండా చెయ్యొచ్చనుకో. అయినా అంతచేటు అనవసరం. ఎంతైనా నేను పాతికేళ్ల కుర్రాన్ని

కాదుగదా...' అద్దంలో అట్టే చూసుకుంటూ తనను తాను పరిచయం చేసుకుంటున్నాడు ఆనందరావు.

ఓ క్షణంలో బాగా మనస్సుకు సంతృప్తి కలుగుతోంది. మరుక్షణంలో కసిగా. అద్దాన్ని పగలకొట్టాలన్నట్లు, ఆందోళనపడుతున్నాడు.

నిబ్బరంగా అట్లాగే నిలబడి జుట్టును చేత్తో పదే పదే నిమురుతూ, కనురెప్పల్ని ఆడిస్తూ, ఎండిపోతున్న పెదిమలను తడి చేసుకుంటూ, 'నాలో ముసలి కళ మాత్రం, రాలేదు' అని నిశ్చయంగా అనుకున్నాడు ఆనందరావు.

ఆ నిట్టూర్పువాయువులు, పూర్తిగా సమసిపోకమునుపే 'వస్తా......' అంటూ సిమ్మెం గడపలో దిగబోతున్న వాసు నొయసు అమాంతం చేత్తోనొక్కేసి, 'నువ్వేం చెప్పక్కర్లేదుగాని, వెళ్ళిరా' అంటూ వాకిటిగేటుదాకా పంపించేసి చేతులు రెండూ దులుపుకుంటూ, లోపలికి వచ్చేశాడు ఆనందరావు.

'ఎట్లాగయితేనే ఓపసివాడి నోరు మూసేసి, మీరు విజయాన్ని సాధించారు...' వంచిన తల యెత్తకుండా తాపీగా అన్నది శారద.

నీకెన్నిసార్లు చెప్పినాకూడా అర్థం కాకపోతే నేనేం చేస్తాను. నన్ను ఎగతాళి చెయ్యటంలోనే నీకు సరదా అయితే, ఆ సరదా తీర్చటానికి యెప్పుడూ నే సిద్ధమే...' నవ్వు తెప్పించుకోవటానికి విఫల ప్రయత్నంచేశాడు, ఆనందరావు.

'నా సరదా అట్లా వున్నదాన్ని వున్నట్టుగా చూట్టం...లేంది ఉన్నట్టుగా ఊహించుకోకపోవటం అంతే..." నిక్కచ్చిగా అనేసింది.

ఆనందరావు యేమీఅనలేకపోయాడు. మెదలకండా వూరుకున్నాడు. శారద కూడా ముభావంగానే వుండిపోయింది.

ఈయనకెందుకు యింతతాపత్రయం. ఈ మధ్యలో ఆయన ఆలోచనల్లోనూ ఊహల్లోనూ, యెంతో మార్పు కనిపిస్తోంది. తీర్చుకోలేని కోర్కెల్ని పెంచుకుంటున్నారు. ఎందుకనో అర్థం కావటంలేదు. తనలో తాను తీవ్రంగా మధనపడుతోంది ఆయన వాలకం, ధోరణి చూస్తుంటే, శారద మనస్సు పరి పరి విధాలుగా ఆలోచిస్తోంది. చప్పున త్రుళ్ళిపడ్డట్లయింది. ఏదో తళుక్కున మెరిసినట్లయింది. క్షణంలో మొహం విప్పారింది. సంతృప్తిగా నవ్వుకుంది.

ఆనాడు, ఆఫీసునుంచి వస్తూనే కసిగా, అమాంతం కుర్చీలో కూర్చుని కాలిబూటును విప్పేసి, వరండాలోకి గిరాటు పెట్టాడు. పడక కుర్చీలో పడుకుని, చేతులు రెండూ వెనక్కు పొడుగ్గా బారజాపి, బుసలుకొడుతున్నాడు. భర్త హడావిడి అంతా ఓకంట గమనిస్తూనే, యేమీ తెలియని దానిలాగ, వయ్యారంగా వచ్చి, చిరునవ్వుతో పలకరిస్తూ, ఆనందరావుకు టీ కప్పును అందించింది శారద.

విప్పారిన మొహంతో భర్తవంక అదే పనిగా చూస్తూ 'మీరివ్వాళ యెట్లావున్నా రనుకున్నారు నవమన్మథుల్లాగా వున్నా రంటే నమ్మండి...' నిబ్బరంగా ఆశగా అన్నది శారద.

ఆనందరావుకు వీపు తట్టినట్లయింది.

'ఆ'...అంటూ ఆశ్చర్యంగా, భార్య మొహంలోకి విడ్డూరంగా చూశాడు, పడుకున్నవాడల్లా, గభాలున లేచి కూర్చుని.

మళ్ళీ క్షణంలో తల దించేసి, చప్పగా పడుకున్నాడు.

'ఇంతమాత్రంతో మోసపోన్లే, నన్ను ఉలికించటానికి యిదికూడా ఓ పద్ధతే --' అసహనాన్ని ప్రదర్శించాడు.

'నేను ఉన్నది ఉన్నట్టుగా చెపుతా. ఎగ్జాజిరేట్ చేసి చెప్పాలసిన అవసరం యేమీ లేదు. మీలో యివ్వాళ పూర్తిగా మార్పును చూస్తున్నా. ఇది నిజం. ముమ్మాటికీ నిజం...'అంటూ తన నిజాయతీని శంకించటానికి వీల్లేకండా, తొణకుండ గంభీరంగా అనేసింది శారద.

కళ్ళు పెద్దవిచేసి, ఆమెమొహంలోకి ఓ క్షణంలో ఆలోచనగా చూశాడు.

శారద భేషాలకు యేమీ పోదు. ఉన్నది ఉన్నట్లు అనేస్తుంది. నిజమే! తల విదిలించేసుకున్నాడు. మరి యిందాక ఆఫీసులో ఆ సునీతకు వచ్చిన యేళ్ళకు, నన్ను తండ్రిలాంటి వాడం టుందేమిటి! ఆవిడ కళ్ళకు అట్లా కనిపించానేమో! క్రాఫు యెత్తుగా వుండే అని నన్ను చూసి వ్యంగ్యంగా అంటాడేమిటి ఆ సీను. ఆనందరావుగారు కూడా సాగించారు. చెంపపట్టీలు కిందకు లాగటం అని కామెంటూ! ఆ ముసలి వెధవ వాడికి నాకు పోలికేమిటి. ఇంకా నాలు గేళ్లల్లో మనోవర్తి తీసుకోబోతున్నాడు. ఇదంతా నన్ను చూసి అసూయపడటం కాబోలు. అంతకంటె యేమనుకోవాలి. తనలో తాను నవ్వుకున్నాడు. శారద అబద్ధమాడదు. ఇవ్వాళ, శారద నిజంగా ఉన్నది ఉన్నట్లుగానే వుంది. శారద కంటికి ఆ విధంగా కనిపిస్తున్నా నంటే నా ఊహ తప్పుకాదు.

తనలో తాను తర్కించుకుంటూ, శారదను, దగ్గరకు తీసుకోబోయాడు, కృతజ్ఞత తెలియపరచటాని కన్నట్లు.

'టీ ఒలికిపోతుంది...వుండండి... అయ్యో .నే కిందపడేటట్టున్నా .' ఉక్కిరి బిక్కిరయింది శారద.

'మహాపడితేనా వళ్లోపడతాఅంతేగా...' మొహంలో మొహంపెట్టి, ఆనందరావు నవ్వుతుంటే, ఆయన మొహంలో ముడతలు శారదకు కొట్టొచ్చినట్టు కనిపించి నాయి.

ఇంట్లో ఉత్సాహం రోజురోజుకు మితిమీరిపోతుంది. శారద భర్తను పూర్తిగా ఆకట్టేసింది. ఏమాట మాట్లాడినా, ఏపనిచేసినా, శభాషని మెచ్చుకుంటున్నాడు. కాని బైట అడుగుపెట్ట

టానికి మాత్రం ఆనందరావుకు భయం గానే వుంటోంది. ఎవరు ఏ క్షణాన రఫీ మని ఏమాటంటారో అని హడలిపోతూ వుంటాడు. ఎవరితోనైనా కాసేపు మాట్లాడాలిసివస్తే, పొడి పొడి ముక్కలు నాలుగు అనేసి 'వస్తా' అనిగ్రరున తిరిగి వెళ్ళిపోతూ వుంటాడు. ఆఫీసుకు వెళ్ళే ముందు, అద్దాన్ని పలకరించే టైము రోజు రోజుకు యెక్కువయిపోతోంది. **ఎంతసేపు** చూసుకున్నా, ఏదో **క్షణంలో** ఒక్కసారి గతుక్కుమనటం **తప్పటం**లేదు.

ఆఫీసులో యెవరి నోరైనా కట్టె య్యొచ్చుగాని, ఆ సుందరం నోటికి మాత్రం హద్దుండదు. ఎంతమాటపడితే అంతమాట అనేస్తాడు. అందులో మరీను ఆ టైపిస్ట్ ముందరే!

'మీరు పెద్దవారు. ఏంచెప్ప మంటారు ఆ ఫైలు సరిగ్గ చూడకపోతే యెట్లాచెప్పండి. మీ ఎండార్స్‌మెంట్ మీదగదా నేను డిసిషన్ తీసుకునేది...' అంటాడు సుందరం.

' మీరు రాసింది తప్పు. ఒళ్ళుదగ్గర పెట్టుకుని బాధ్యతగా వ్యవహరించాలి. ముందు ముందు వృద్ధిలోకి రావలసిన వారు. మీరే యిట్లా చేస్తే యెట్లాగు' అని ముక్కచివాట్లుపెడితే నేను యెంత సంతోషించేవాణ్ణి వాడికి అదేం మాయ రోగమొ 'మీరు పెద్దవారు' అని మొదలు పెడతాడు అనుకుంటూ ఆనందరావు చిటచిటలాడిపోతున్నాడు.

ఆనందరావు గడియారం పెండులం లాగ ఊగిసలాడిపోతున్నాడు. అటూ యిటూ, అటు యిటూ, ఆయన మనస్సు నిలకడలేకండాపోయింది.

సూర్యుని లేతకిరణాలు, వెచ్చ వెచ్చగా గేటులోంచి పోర్టికోలోకి, దూసుకుని సూటిగ వంటింటివైపుకు ప్రసారమవుతున్నాయి. పల్చటి డోర్ కర్టెన్ చిరుగాలికి రెపరెపలాడుతుంటే, ఆ సందుల్లోంచి వెలుతురు గోడ గడి యారంమీద పడి తళతళ మంటోంది.

ఆనందరావు, పడకకుర్చీలో పడు కుని, అట్టే ఆ వెలుతురును చూస్తు న్నాడు. టంగ్‌టంగ్‌మంటూ గోడగడి యారం ఎనిమిది గంటలు కొట్టింది. అప్పుడే యింత టైమయిందా అను కుంటూ, బద్ధకంగా లేచి, వంటింటి వైపుకు నడిచాడు శారద, దొడ్లో తులసిచెట్టు దగ్గర, తల ఆరపోసు కుంటోంది. ఆనందరావు కళ్ళు కుర చయినాయి. ఆమె తల సూర్యరశ్మికి తెల్లతెల్లగా మెరుస్తోంది. అట్లాగే నిలబడి పోయాడు. జుట్టును కుడివైపు బుజం మీదకుపోనిచ్చి, తుండుగుడ్డతో, గట్టిగా తుడుచుకుంటుంటే, శారద మొహం సగంవరకే కనిపిస్తోంది ఆనందరావుకు. ఆశ్చర్యపోయాడు దవడలు అంటుకు పోయి, ఆమె మొహం గాంభీర్యంగా కనిపించింది. ఆ చేతుల్లో కూడా, నాజూకుతనం ఎక్కడా కనపించటం

లేదు. ఒక్కొక్కసారి తల విదిలిస్తున్నప్పుడు, క్షణంలో మొహం ఎదురుగా కనిపించి, ఆనందరావును భయపెట్టేస్తోంది.

శారద చాలా పెద్దదయిపోయిందేమిటి! తలకూడా నెరసింది. ఇట్లా వుందేమిటి అనుకుంటున్నాడు.

'ఏమిటి పరీక్షచేస్తున్నారు! ...' తల తుడుచుకుంటూనే, భర్తవైపుకు తిరక్కుండానే అన్నది శారద.

'అబ్బే ఏముంది, ఏంలేదు' అన్నట్టుగా, తల అడ్డంగా మెల్లిగా రెండు మూడుసార్లు కదిలించాడు ఆలోచనగా.

ఆనాటినంచీ కూడా శారదను చూస్తున్నప్పుడల్లా, ఆనందరావు మనస్సు చివుక్కుమంటూ వుంటుంది. రోజురోజుకు, ఆమె ఆకృతిలో ఆకర్షణ తగ్గిపోతున్నట్లు, ఆ యింట్లో యెవత్తో ఓ పెద్ద యిల్లాలు సంచరిస్తున్నట్లు అతనికి అనిపిస్తోంది.

భర్తలో కలుగుతున్న మార్పును శారద గ్రహించినప్పటికి, ఫలానా అని తెలుసుకోలేకపోతోంది. విడ్డూరంగా తనవైపే చూడటం, ఒక్కొక్కప్పుడు ఆశ్చర్యంగా, తనను చూస్తూ నిలబడిపోవటం గమనిస్తూ, శారద మధన పడుతోంది.

ఆనందరావుమాత్రం రోజూ గంటా రెండుగంటలు మేకప్ చేసుకోవటం మరచిపోవటంలేదు. ఉత్సాహంగా గంతులేస్తున్నట్లు, యింట్లో మాట్లాడుతూ వుంటాడు. అతని మనస్సులో యింకా యింకా కోర్కెలు చెలరేగుతున్నట్లు, అతని మాటలధోరణిలో శారదకు తెలుసుకుంది. కాని, ఆమె భర్తకు యే ఆంక్షలు విధించలేని పరిస్థితిలోనే వుండిపోయింది.

ఊరంతా గాలించి, గిరున యింటికి వచ్చేటప్పటికి, శారదను చూడగానే, మూర్ఛ వచ్చినంత పనవుతుంది, ఆనందరావుకు

ఉల్లాసంగా ఊగిసలాడుతూ, శారదకు ఎదురుగా కూర్చుని, చిరునవ్వుతో పలకరించాడు. రెండుచేతులు రెంటిని, గంభీరంగా, పైపైన రాసుకుంటూ, కళ్ళు రెండూ పెద్దవి చేసుకుని 'శారదా' అన్నాడు తాపీగా.

ఏమిటన్నట్లు కనుబొమ్మలు పైకి క్రిందకు కదిలించింది

"ఏం లేదు నువ్వు ముసలిదానివయిపోతున్నావు...ఉహు ... నా ఉద్దేశం, నీలో ముసలికళ బాగా వచ్చేసింది..." నాలుక కరుచుకున్నాడు.

'అవును నిజమే. రేపు శ్రావణమాసానికి, నాకు నలభై అయిదేళ్ళు వెళతాయి చిన్నదాన్నా నేను మరి...' అంటూ శారద యేదో చెప్పబోతుంటే, చివాలున లేచి, చెవులు రెంటిని రెండు చేతుల్తోనూ గట్టిగా మూసుకుని, 'యిహ చాల్లే. ఆపు' అంటూ గట్టిగా అరిచాడు ఆనందరావు.



పాలకోడేటి
సత్యనారాయణరావు

# ఈ పిల్లకు పెళ్ళికాదు!

కృష్ణ ఆ సమయంలో రావటం రామ్మూర్తికి ఆశ్చర్యాన్ని కలుగజేసింది. ఇంట్లో మెత్తటి పరుపుమీద అందమైన బొంబే డయింగ్ కవర్లమీద హాయిగా అందంగా ఆనందాన్ని అనుభవిస్తూ, చేస్ నవలను చదువుతూ ఆ నవలలోనున్న సంఘటనలకు సైతం ఆశ్చర్యపడని రామ్మూర్తి, కృష్ణ రావటం చూసి మరింతగా ఆశ్చర్యపోయాడు.

ఆ సమయంలో అసలు కృష్ణ రావటమే ఆశ్చర్యం. నవలలోని ఆనందానికీ, ఆశ్చర్యానికీ అంతరాయం కలిగిస్తూ తలుపుతట్టిన చప్పుడు. విసుగుతో తలుపుతీశాక చూస్తే వచ్చింది ప్రాణస్నేహితుడు-కృష్ణ!

గడియారాన్ని చూశాక రామ్మూర్తికి ఆశ్చర్యం రెట్టింపయింది. గడియారంలో ముళ్లు రెండూ కూడబలుక్కున్నట్లుగా పన్నెండు దగ్గర చేరాయి.

"రా, రా, కాయా. పండా?"

కృష్ణ ఏమీ అనలేదు. నెమ్మదిగా లోపలికి నడిచాడు. లోపలికినడిచి, నెమ్మదిగా పరుపుమీద కూర్చుంటూ అన్నాడు : "కాయా, పండా అనడిగితే నేనేం చెప్పను! నేనా అమ్మాయిని అసలు చూడనేలేదు."

రామ్మూర్తి షాక్ తిన్నాడు-"అదే మిత్రా ?"

"అదేమిత్రా అంటే ఏంచెప్పను ?" అంటూ షూ విప్పుకొన్నాడు కృష్ణ. పరుపుమీద వెల్లకిలా పడుకొంటూ పైన తిరుగుతున్న ఫానుకేసి చూశాడు కృష్ణ-ఫాను గిరగిర తిరుగుతూ ఉంది-ఫానుకున్న బ్లేడులేవీ కనబడ్డంలేదు. కృష్ణకు నవ్వొచ్చింది-ఎంత గొప్ప సామ్యం ఇది-ఒక వ్యక్తిలో ఉన్న గుణాలన్నీ కలిసి గుప్తంగా ఉంటాయి. ఆ గుణాల్లో మోసం ఎక్కువగా ఉందో, కక్షఎక్కువగా ఉందో, ఆప్యాయతా ఆదరణలేలక్కువగా ఉన్నాయో సామాన్యంగా తెలీదు. కానీ పరీక్ష అనేది ఓ సమయంలో వస్తే...ఫాను ఆపగానే కనబడే బ్లేడుల్లాగ—ఏ గుణంకు ఆ గుణం తేటతెల్లమైపోతుంది-కానీ ప్రాణస్నేహితుడనుకొనే వాడే ఇలా చేస్తే... ?

'సృష్టిలో తీయనిది స్నేహమేనోయ్ !' అంటారు. కానీ తీపికూడ ఎక్కువైతే మొహం మొత్తినట్లుగా, స్నేహంకూడ హద్దుదాటితే, బీటలు తీస్తుందేమో !

"ఏమయిందిరా అంటే జవాబు చెప్పవేం ?" రామ్మూర్తి మళ్లీ అడిగాడు.

కృష్ణ పేలవంగా నవ్వాడు- "అది సరేగానీ, ముందీ సంగతి చెప్పరా-ప్రాణస్నేహితుణ్ణి మోసం చేయిదలిచిన వాణ్ణి ఏం చేయాలిరా ?"

రామ్మూర్తికీ ప్రశ్న అర్థంగాలేదు. "అసలు ఏం జరిగిందిరా ?"

"ముందు నా ప్రశ్నకు జవాబియ్యి!"

"ఏం చేసినా తప్పు లేదంటాను."

"అయితే నిన్నేం జేసినా తప్పు లేదురా! అయినా నన్ను మోసం చేయలనే ఊహ నీ కెప్పుడొచ్చిందిరా ?"

రామ్మూర్తి తెల్లపోయాడు. క్షణం ఆగి అడిగారు కృష్ణను-"అసలు జరిగిందేమిటో చెప్పకుండా నన్నిలా నిలవేయటం ఏం బాగుంటుంది ?

"నీకు సరోజ అంటే అసహ్యం ఎందుకు కలిగిందిరా?"

రామ్మూర్తికి క్షణంపాటు ఒళ్లు మండిది తన్ను తాను సంబాళించుకొంటూ నెమ్మదిగా అన్నాడు : "కృష్ణా! ఒకసారి ఈ సంగతి చెప్పు. నువ్వసలు ఏమంటున్నావో తెలిసే అంటున్నావా?"

"ఆ, నీకే ఆశ్చర్యంగా ఉండి ఉండాలి నాకీ సంగతి తెలిసిపోయిందని! నువ్వూ సరోజా ప్రేమించుకొన్న సంగతి నాకు తెలిసిపోయింది !"

రామ్మూర్తి పకాలున నవ్వాడు : "సరోజా నేను ప్రేమించుకోవటమా ?"

"నవ్వకురోయ్ రామ్మూర్తి-నాకు ఒళ్లుమండిపోతోంది. నువ్వు సరోజను ప్రేమించావు బాగానే ఉంది. మీ ఇద్దరికీ గొడవొచ్చిందనుకో, అంతమాత్రంచేత చేసుకోనంటే ఎలారా –. అలా అయినా బాగానే ఉండేది–నాకు అర్థంకానిదొక టేరా–మీ ఇద్దరికీ గొడవొస్తే సరోజను చేసుకోమని నాకు నువ్వు సలహా ఇవ్వటమే !"

"అర్థం లేకుండా మాట్లాడకురా కృష్ణా! సరోజ, నేనూ ఒకే ఆఫీసులో పని చేస్తున్న మాట వాస్తవమేగానీ, మిగ తాది–అదే, సరోజను నేను ప్రేమించటం, మా ఇద్దరికీ గొడవొచ్చి, నీ స్నేహాన్ని నేనేదో దుర్వినియోగం చేసుకోవటం... ఇదంతా అట్టర్ నాన్సెన్స్! నీకు ఆ పిల్లను చేసుకోవటం ఇష్టంలేకపోతే ఆ సంగతి స్పష్టంగా ఏడు అంతేగానీ ఇలా అమ్మాయిమీద అభాండాలు వేయకు! నీకు ఇంకో సంగతి చెప్పనీ నన్ను–ఈ క్షణంవరకు సరోజతో ఒక్కసారంటే ఒక్కసారైనా మాట్లాడి ఎరగను నేను-నిన్ను మోసంచేయాలనే ఊహే లేదు నాకు! నువ్వు సరోజను చేసుకొంటావో, చేసుకోకుండా గంగలో దిగుతావో నీ ఇష్టం! ... అంతట నువ్వు నన్ను సరోజను గురించి అడిగావు కనుక 'మంచిపిల్లే చేసుకో' అన్నాను. కేగాని ఇందులో నాకేమీ ఇంటరెస్ట్

"అంటే సరోజ నీకసలు తెలీనే తెలీదా ?"

"తెలీదు. ఇంతకీ అసలు సంగతి చెప్పు–సరోజ నచ్చలేదుటా ?"

"సరోజ నచ్చకపోవటం దాకా ఎందుకు. నేనసలు ఆవిడను చూడనే లేదు !"

రామ్మూర్తి ఆశ్చర్యపోతూ అడిగాడు : "మరి పెళ్లిచూపులకే గదరా వాళ్ల ఇంటికి వెళ్లింది."

"నేను వెళ్లింది వాళ్ల ఇంటికి కాదు, వాళ్ల ఊరికి వెళ్లాను ! అంతే, ఆపైన ఇంకేమీ జరగలేదు !"

"అదేం ?"

"అదేమంటే, ఇంకా ఏం చెప్పను ? ఆ ఊళ్లో దిగీ దిగ్గానే తెలిసింది నీకూ సరోజకూ ఏదో సంబంధం ఉందని."

"అలా కాదుకానీ, జరిగింది జరిగినట్లు చెప్పరా..." అన్న రామ్మూర్తికి చెప్పటం కోసం జరిగింది గుర్తుకు తెచ్చుకున్నాడు కృష్ణ

*   *   *

ఊరికి అరమైలు దూరంలో ఉన్న చిన్న షెడ్ ముందు రైలు ఆగింది. కృష్ణ రైల్లోంచి దిగాడు. తనుకాక ఇంకా ఎవరో ఇద్దరు దిగారు ఆ రైల్లోంచి. రైలు కదిలేంతవరకూ అక్కడే నిలబడ్డాడు. రైలు కదిలాక చూస్తే తనకోసం ఎవరూ వచ్చినట్లుగా కనిపించలేదు అతనికి.

వెనక్కు వెళ్లిపోదామా అని క్షణం

ఆలోచించాడు- పెళ్లిచూపులకు తనొస్తున్న సంగతి ముందుగానే వాళ్లకు తెలుసు. అయినా వాళ్లు రాలేదు. ఎందుకో!

రామ్మూర్తి చెప్పనే చెప్పాడు-సరోజ వారం రోజులు సెలవుపెట్టి ఇంటికి వెళ్లిందని !- కానీ తనకోసం ఎవరూ రానేలేదు.

స్టేషన్ మాస్టరు వచ్చి టికెట్ తీసుకొనివెళ్లాడు. దాంతో స్టేషన్లో మనష్యులందరూ వెళ్లిపోవటంతో, స్టేషన్ నిర్మానుష్యం అయిపోతోంది. తను తిరిగి వెళ్లాలన్నా సాయింత్రం వరకు రైలు ఏదీలేదు. ఇక్కడా చేయగలిగేది ఏదీ లేదు. నెమ్మదిగా కదిలాడు, స్టేషన్లోంచి బయటకు.

బయట చెట్టుకిందనున్న టీకొట్లో టీ తాగి బయటకు వచ్చాడు. అక్కడే ఒక బల్లమీద కూర్చున్న ఒకతన్ని అడిగాడు: "ఏమండీ... మీకు సుందరరామయ్య గారిల్లు తెలుసా ?"

"ఏ సుందరరామయ్య ?"

ఏ సుందరరామయ్యో తనకు తెలీదు. ఎలా గుర్తుచెప్పటం ?- "వాళ్ల అమ్మాయి పేరు సరోజ అని..."

అతను లేచాడు. నెమ్మదిగా అన్నాడు : "ఓహో, వాళ్లా ? వాళ్లు మీకేమైనా చుట్టాలా ?"

"కాదులెండి, కొంచెంపనుంది. వాళ్ల ఇల్లెక్కడో చెబితే..."

కృష్ణకేసి తేరపార చూశాడు అతను. క్షణం ఆగి అన్నాడు- "పదండి, వాళ్ల ఇంటికేగా, నేనూ వస్తా ఊళ్లోవరకు !"

ఇద్దరూ కదిలారు. పది అడుగులు వేశాక అడిగాడు అతను కృష్ణను : "మీ పేరు రామ్మూర్తా."

తెల్లపోయాడు ! "కాదు."

"మీరు సుందరరామయ్యకు ఏమవుతారు ?"

"నేను వాళ్లకు ఏమీకాను ?"

"మరింకేమిటి పని ?"

కృష్ణకు విసిగెత్తింది - పల్లెటూరు అయితే ఇదే బాధ. ఊళ్లోవాళ్ల అందరి గొడవలూ వీళ్లకే కావాలి ! తన్ను తను తిట్టుకొంటూ జవాబిచ్చాడు : "వాళ్ల అమ్మాయిని చూడ్డానికి రమ్మన్నారు. అందుకని !"

నడుస్తున్న అవ్యక్తి ఒకసారి హఠాత్తుగా ఆగిపోయాడు : "మీ పేరు రామ్మూర్తి కాదంటారేగా !"

"కాదు !"- రామ్మూర్తి ఈ ఊళ్లో బాగానే పేరు సంపాదించినట్లుగా ఉన్నాడు

ఆ వ్యక్తి నెమ్మదిగా అన్నాడు : "మరేంలేదులెండి, ఎందుకడిగానంటే, నాతో సుందరరామయ్య చెప్పాడు- వాళ్లమ్మాయి సరోజ రామ్మూర్తినే చేసుకొంటూందని! బహుశా మీరే రామ్మూ అనుకొన్నాను ! అని క్షణం ఆగి అనుకొంటున్నట్లుగా అనా

"బహుశా చెడి పో యిం దే మో ఆ సంబంధం–"

కృష్ణకు ఛెళ్లున తగిలింది ఆ మాట–'బహుశా చెడిపోయిందేమో ఆ సంబంధం అంటే...రామూర్తీ ఎంతకు తెగించావురా నువ్వు! నన్ను విసిరావేం ఈ వల్లోకి?–'

కృష్ణ తేరుకొంటూ అడిగాడు. "మీరు చెప్పేది సరోజ గురించేనా?"

"ఆ, ఆ పిల్లనుగురించే చెప్పేది. ఆ రామూర్తీ సరోజా ఇక్కడ ఎన్నో సార్లు కలిసితిరగటం నా కళ్లతోనే చూశాను. ఆ మాటే అంటే. సుందర రామయ్య అ పుడు చెప్పాడు–వాళ్లిద్దరూ పెళ్లి చేసుకొంటారని. ఏం జరిగిందో ఏమో మరి..."

ఊళ్లోకి వచ్చారు ఇద్దరూ. ఆ వ్యక్తి దూరంగా ఉన్న ఒక ఎత్తుఅరుగుల ఇల్లు చూపిస్తూ అన్నాడు. "అదే సుందర రామయ్యగారిల్లు. నేను ఇటు వెళ్లాలి!" అంటూ పక్కనే ఉన్న వీధిలోకి తిరిగాడు.

కృష్ణ క్షణంసేపు ఆ ఎత్తు అరుగుల ఇంటికేసి చూశాడు–అరుగులు ఎత్తేగానీ, నైతికంగా...కృష్ణ వెనక్కు తిరిగాడు.

* * *

"ఆశ్చర్యంగా ఉందిరా కృష్ణా నువ్వు చెప్పింది! నువ్వు నన్ను నమ్ము. నమ్మకపో, సరోజతో నేనింతవరకూ ఒక సారైనా మాట్లాడలేదు. కానీ ఆఊర్లోనేను ఇంత పేరు ప్రఖ్యాతులు సంపాదించుకోవటం ఆశ్చర్యంగానే ఉంది!"

కృష్ణ ఏమీ అనలేదు.

రామూర్తి నెమ్మదిగా అన్నాడు–"రేపు వాళ్ల ఊరికి వెడదాం రా!"

"ఎందుకు?"

"ఈ సంగతి తెలుసుకొని తీరాలిరా! తప్పదు. ఇంత జరిగిందంటే, దీని వెనక ఏదో ఉండి ఉండాలిరా!"

కృష్ణకు ఈ విషయం ఆసక్తి కలిగింది. "అయిఉండొచ్చురా, ఇదేదో కథలాగే ఉందిరా! వెయ్యి అబద్ధాలు ఆడి అయినా ఒక పెళ్లి చెయ్యమన్నారు కానీ, ఇక్కడ ఒక్క అబద్ధంతోటే పెళ్లి చెడగొట్టార్రా! ఆశ్చర్యంగానే ఉంది ఆలోచిస్తోంటే!"

మర్నాడు ఇద్దరూ ఆ స్టేషన్లోదిగి సరోజ ఇంటికేసి నడిచారు.

వీళ్లు ఆ ఇల్లు–ఎత్తు అరుగుల పెంకుటిల్లు–చేరుకొనేసరికి సరోజ అరుగుమీద కూర్చొని ఏదో చదువుకొంటోంది. వీళ్లను చూచి లేచి నిలబడింది.

"సుందరరామయ్యగారిల్లు ఇదేనా?"

ఔనంది సరోజ.

"అయితే, ఆయన లేరా–"

"లేరు, ఇపుడే బయటకెళ్లారు. రండి లోపలికి!" అంటూ లోపలికి దారితీసింది. వీళ్లుకూడా లోపలికి నడిచారు. గుమ్మం దాటగానే ఎదురుగాఉన్న ఫోటోలో

సుందరరామయ్య చిరునవ్వులు చిందిస్తూ కనబడ్డాడు.

కృష్ణకు మతిపోయింది—ఇతనా సుందరరామయ్య?

"కూర్చోండి! ఇపుడే వస్తాను!" అంటూ లోపలికి వెళ్ళింది సరోజ.

కృష్ణ ఇంక ఆపుకోలేకపోయాడు— "మూర్తీ. నిన్న నాకు చెప్పింది ఇతనేరా!'' అంటూ ఫోటో కేసి చూపించాడు. రామ్మూర్తి ఆ ఫోటో కేసి చూశాడు.

సరోజ, వాళ్ళమ్మ బయటకొచ్చారు.

రామ్మూర్తి వాళ్లకు సంజాయిషీ ఇస్తున్నట్లుగా అన్నాడు —"క్షమించండి, నిన్ననే రావాల్సింది. కానీ..."

"ఫర్వాలేదులెండి." అంటూ, కృష్ణ ఫోటో కేసిచూస్తూ ఉండటంచూసి అంది సరోజ ''అది మా నాన్నగారి ఫోటో!"

రామూర్తి కృష్ణ ఇద్దరూ తెల్లబోయారు.

రామూర్తి నెమ్మదిగా తేరుకొన్నాడు— "నిన్న మీరు మాకోసం వెయిట్ చేసి ఉంటారు! కానీ..."

''బహుశా రైలు తప్పిపోయి ఉంటుంది!'' నవ్వుతూ అంది సరోజ.

"నేను వెళ్ళి కాఫీ తెస్తాను బాబూ! అమ్మాయితో మాట్లాడుతూ ఉండండి—" అంటూ లోపలికి వెళ్ళింది సరోజా వాళ్ల అమ్మ.

రామ్మూర్తి అన్నాడు సరోజతో "చూడండి, మేమెందుకొచ్చామో మీకింకా తెలీదనుకొంటా!"

"తెలీకేం, మీరు పెళ్ళిచూపులకేగా వచ్చింది!"

కృష్ణ నవ్వాడు ప్రతిగా నవ్వుతూ అంది సరోజ: మీరేం ఆశ్చర్యపోనక్కర్లేదు. నాకు బాగా అలవాటయి పోయింది. మీది బహుశా ఏ ఇరవయ్యవదో అయిఉంటుంది. అందుకే పెళ్ళి చూపులంటే మొదట్లో ఉండే బిడియమూ సిగ్గూ అన్నీపోయాయి. మీరు రాగానే చాల ఈజీగా రిసీవ్ చేసుకొనే పరిస్థితికి వచ్చాను!''

కృష్ణ నవ్వుతూ అడిగాడు: "మీరేమీ అనుకోనంటే...''

"అడగండి-మీ రడిగేదేదో నాకు తెలిసిపోయింది.రామ్మూర్తిగారి గురించేగా మీరడిగేది?" నవ్వి, నెమ్మదిగా అంది సరోజ— "మీరు చాలమందికన్నా చాల నయం. చాలమంది అక్కడికక్కడే వెళ్ళిపోయారు. మీరు కనీసం ఇంటి వరకు అయినా వచ్చారు. థాంక్స్! —మీరు నన్ను చేసుకొన్నా, చేసుకోక పోయినా ఒక సంగతి రామ్మూర్తిగా రెవరో నాకింతవరకూతెలీదు. మేమిద్దరం ఒకే ఆఫీసు అయినా నేసింతవరకూ ఆయన్ను చూడనైనాలేదు అనవసరంగా నావల్ల ఆయనకు చెడ్డపేరొస్తోంది," అంటూ ఆగింది సరోజ-ఆసంగతి ఎవరు చెబుతున్నారోగానీ, అందరికీ అదే చెబుతున్నారు. ఎందుకో అర్థం కావటంలేదు!



"నాకు అర్థమవుతోంది!" అంటున్న రామ్మూర్తిని కట్ చేస్తూ అంది సరోజ– "అదుగో, నాన్నగారు రానే వచ్చారు!"

లోపలికి వచ్చిన సుందరరామయ్య కృష్ణను చూసి నివ్వెరపోయాడు.

"మీరా?–"

"..."

సరోజ లోపలికి వెళ్ళిపోగానే అన్నాడు సుందరరామయ్య. "నన్ను క్షమించండి బాబూ! గుర్తు పట్టలేక పోయాను–"

కృష్ణ సంబాళించుకొంటూ అన్నాడు– "పర్వాలేదులెండి. అయినా ఈ సంగతి చెప్పండి, ఎందు కిలా చేశారు?"

"ఎలా?"

"మీ అమ్మాయికీ, రామ్మూర్తికీ సంబంధం ఉందంటూ..."

సుందరరామయ్య ధైర్యంగా అన్నాడు– "అది ఉన్నమాటే గదండీ, నిప్పులేనిదే పొగ రాదని సామెత. అన్ని సంబంధాలు వచ్చినా, అన్నీ చెడిపోతున్నాయి. దీని ప్రవర్తనవల్ల. ఏం చేయను?"

"చెడిపోతున్నా యనకండి! చెడగొట్టానని చెప్పండి సుందరరామయ్యగారూ!- ఈరోజువరకు ఆ రామ్మూర్తి మీసరోజను ఎరగనే ఎరగడు. ఎందుకంటే నేనే ఆ రామ్మూర్తిని గనుక! ఎందుకిలా చేస్తున్నారు?" రామ్మూర్తి గట్టిగానే అడిగాడు.

సుందరరామయ్య ముఖాన కత్తి వేటుకు నెత్తురుచుక్క లేదు. తేరుకొంటూ అన్నాడు-"ఎందుకిలా చేస్తున్నానంటే ఏం చెప్పను బాబూ! దౌర్భాగ్యం! కన్న తీపి కన్నకడుపుతీపి ఎక్కువయివండి. సంపాదించే ఒక్కపిల్ల చేయిజారిపోతే, మేము చేతులు చాచుకొని భిక్షం అడుక్కోవాల్సిన పరిస్థితి వస్తుంది. అందుకే.. అందుకే...ఏ తండ్రీ, ఏబిడ్డకూ చేయని ద్రోహం చేస్తున్నాను!" భోరున ఏడ్చాడు సుందరరామయ్య. "మీరు నాకన్న చిన్నపిల్లలు. అయినా చేతులెత్తి మొక్కుతాను. మీరు వెళ్ళిపోండి. నాకున్న ఈ ఒక్క ఆధారమూ పోగొట్టి నన్ను అనాథను చేయకండి!"

రామ్మూర్తీ, కృష్ణా చాలసేపు నిశ్శబ్దం [illegible]బడ్డారు

"సుందరరామయ్యగారూ——ఒక్క మాట.. నేను సరోజను చేసుకొంటానండీ." అన్నాడు రామ్మూర్తి హటాత్తుగా.

"వద్దుబాబూ వద్దు! పిల్లమీద నింద ఉంటే పిల్లకు పెళ్ళి కాదనే ధైర్యంతో పిల్లను అపనిందలపాలుజేసి చస్తూబతుకుతున్నాను. నాకున్న ఈ ఒక్క ఆధారాన్ని పోగొట్టకండి!"

"మీ రనవసరంగా బాధపడకండి! సరోజ పెళ్ళి అయిపోతే మీకున్న ఒక్క ఆధారము పోవటం ఎలాగవుతూంది? ఇపుడు మీరు ఒక్కరిమీదే ఆధారపడి ఉంటే పెళ్లయాక ఇద్దరం మీకు ఆధారం అవుతాం. మీ పరిస్థితి నేను అర్థంచేసుకొనే చెబుతున్నాను. నన్ను కాదకనండి!"

రామ్మూర్తి ఇంకా ఏదో అనబోతున్నాడు. సుందరరామయ్య వినటం లేదు. సుందరరామయ్యకు ఆ అనుభూతి కొత్తగా ఉంది. మనిషిని మనిషి ఇంత చక్కగా అర్థంచేసుకొంటాడని అతనికి తెలీదు. ఇంతటి ఆనందం పట్టలేక, కళ్ళనుండి నీరు ధారగా కారుతున్నాయి.

తలుపు దగ్గర నిలబడ్డ సరోజకు మతిపోయింది. ఆనందంతో సంతోషంతో ఉక్కిరి బిక్కిరి అయిపోతోంది. ఆ ఆనందంలో తండ్రిని తేలికగా క్షమించేసింది సరోజ.

రామ్మూర్తి చర్యకు మనసులో జోహార్లు పలుకుతున్నాడు కృష్ణ.





# లయ తప్పిన హృదయాలు

— శార్వరి

(గత సంచిక తరువాయి)

మీనాక్షి జీవితాన్ని ఎంత తేలిగ్గా ఎనలైజ్ చెయ్యగలిగింది దానికిభయం సిగ్గులేవు. నేను అలా రాగలనా? లేదు. నాకు భయంని పిరికితనం. మీనాక్షి ప్రేమ విలువ లేనిదా! అయితే పుస్తకాలలో కనిపించే ప్రేమలు అంతేగదా. మీనాక్షి రామ్‌ల ప్రణయం రాధాకృష్ణుల ప్రేమకు ఎలా తీసిపోతుంది. మన కళ్ళముందు జరిగింది కనుక విలువ లేనిదా! అదే బృందావనంలో, మధురానగరిలో జరిగితే గొప్పా!

మీనాక్షి తలంటి స్నానంచేసి

వచ్చింది. బుజాల మీదికి వెంట్రుకలు జారి శరీరాన్ని కప్పివేస్తున్నాయి ఆమె వనదేవతలా వుంది. ఎంత ఆనందం, సంతోషం తను జీవితంలో ఒక్కరో జైనా అంత పరవశంతో గడపగలిగిందా.

"ఏవోయ్, నన్ను లవ్ చేయాలనిపిస్తోం దేంటి అలాగ తినేసేటట్లు చూస్తున్నావ్" నవ్వుతూ అన్నది మీనాక్షి

"అవును మీనా...నిన్ను చూస్తుంటే అసూయగానే వుంది."

అమాంతంగా వచ్చి కోమలి కౌగ లించుకుంది, "నాకు అలాంటి భయాలు లేవులే."

భోజనం అయినతర్వాత కోమలి విశాల గదికి వెళ్ళింది.

"ఏం అలా సీరియస్‌గా ఉన్నావ్! ఏదైనా సమస్య వచ్చిందా?" ప్రశ్నిం చింది కోమలిని చూడగానే.

"అబ్బే, అలాటిదేమీ లేదండి.కొన్ని కొన్ని నిజాలు మింగుడు పడవుకదండీ, అదే ఆలోచిస్తున్నాను."

"ఏమిటా నిజాలు?"

"మాడమ్, ప్రేమను గురించి ఇన్ని పుస్తకాలు వ్రాశారుగదా! నిజంగా, జీవి తంలో ప్రేమించినవారిని చాలాతక్కువ మందిని చూస్తాంగదండీ, కారణం ఏమి టంటారు? కథల్లో ప్రేమికుల్ని ఆరా ధిస్తాం, ఆదర్శంగా భావిస్తాం. కానీ, జీవితంలో అలాంటివారిని గర్హిస్తాం".

"చీకటిలో ఎన్ని తప్పులు చేసినా ఎవరూ గమనించరు కోమలీ! చీకటి తన కడుపులో మన తప్పుల్ని దాచేస్తుంది. ఆ తప్పులు వెలుగులోకి వచ్చినప్పుడే చిక్కు."

"నా ప్రశ్నకు మీరు సూటిగా సమాధానం చెప్పలేదు!"

"ఏం? ఎవరినైనా ప్రేమించావా?" విశాల సూటిగా అడిగింది.

"నేనా! లేదండీ. కానీ ఆమాట అర్థం తెలుసు కుంటామని... మేడం, మనం కృష్ణుని స్వేచ్ఛాప్రణయ ప్రవృత్తిని ఆరాధిస్తున్నాం. అతని ప్రేమనుపొందిన రాధను, గోపికల్ని పొగుడుతున్నాం. మీ గదిలో ఉన్న ఈ రాధాకృష్ణులు ఎవ రండీ? ఎవరి ప్రేమకు జ్ఞాపకార్థంగా వెలిశారో చెప్పండి."

"మంచి ప్రశ్న వేశావు కోమలీ. నీకు ఆయన్ని గురించి చెప్పలేదు. మేం విడి పోయి చాలాకాలమైంది. చదువుకునే రోజుల్లోనే ప్రేమించుకున్నాం. మా ఇద్దరి అభిరుచులు ఒక్కటే. నేను బ్రాహ్మల అమ్మాయిని. అతను బ్రాహ్మణేతరుడు. పెద్దలు మా ప్రేమను అంగీకరించలేదు. వారిని ఎదిరించే ధైర్యం లేకపోయింది మాకు. సమాజం మనకు ఎదురు తిరిగి నప్పుడు, ఆ సమాజాన్ని ఎదిరించి మనం బ్రతకలేం. అతను శాంతినికేతన్ వెళ్ళాడు. వాళ్ళకులం అమ్మాయినే చేసు కున్నాడేమో తెలీదు. నేను ఆ ప్రేమను ఆ తొలి ప్రేమను చంపుకోలేక, అతన్ని

మరిచిపోలేక అవివాహితగా, ఐమీన్, బ్రహ్మచారిణిగానే ఉన్నాను. క్రమంగా నాకు పెళ్ళిమీద ఇచ్ఛపోయింది.అతనిని జీవితంలో మరచిపోలేను."

"మానిన గాయాన్ని కదిలించాను, క్షమించండి మేడమ్." నాకు మీగురించి తెలుసుకుంటే ప్రేమ రహస్యం తెలిసి నట్లు అవుతుందనుకున్నాను."

"లేదు కోమలీ, మన సాంప్రదాయాలే మనకు పరమ శత్రువులు."

"నా కథ మీకు చెప్పలేను, చెప్ప మంటారా" అని తన జీవిత కథ వివరించి చెప్పింది కోమలి. అంతా విన్నది విశాల శ్రద్ధగా.

"అబ్బా! ఇంత హాలాహలాన్ని ఎలా మింగగలిగావు కోమలీ? నీలో అగ్ని పర్వతాలు ఉన్నాయన్న మాట బిడ్డ కోసం తల్లి పడే ఆవేదన నాకు తెలుసు. మా అమ్మ నా కోసం ఎంత ఏడ్చేదని".

* * *

ఆ సాయంత్రం గదిలో కోమలి, మీనాక్షి పుస్తకాలు ముందుపెట్టుకుని కూర్చున్నారు. కాని, ఎవరికీ చదువు మీదికి మనసు పోవడంలేదు. విశాల, మీనాక్షి, తను ముగ్గురు మూడు రకాలు. తాము మూడు రకాల స్వభావాలకు ప్రతినిధులు ముగ్గురి అనుభవాలువేరు. ఎవరి వ్యక్తిగత జీవితం వారిదె. ఎంత వైవిధ్యం వైచిత్ర్యం.

"మీనాక్షీ! ఒక పాటపాడగలవా" అడిగింది కోమలి.

"ఈ రాత్రికి నోసాంగ్స్, నా గుండె ఆనందంతో నిండిపోయిందని చెప్పానా! పాట బయటకు రాదు. కమ్మని కలలు కనడమే."

* * *

సంవత్సరం అయిపోయింది. మీనాక్షి ఇంటికి బయలుదేరుతుండగా కోమలి అడిగింది. "నీ రామ్‌ని ఏంచేస్తావ్?"

"తను బొంబాయి వెడుతున్నాడట. లేకపోతే ఇక్కడే ఉండిపోయేదాన్ని. ఊరికి వెడుతున్నాగా, మా బావ సెల వలకు వస్తాడు. గాలం వెయ్యాలి. చేప పడ్డదా, మూడు మాసాలు హాయిగా గడిచిపోతాయి."

"ఛ, నీకు సిగ్గులేదు."

"నా సిగ్గు, జస్ట్ ఫన్, లవ్ మేకింగ్ మేడ్ ఈజ్."

"నీకింతధైర్యం ఎలా వచ్చిందే మీనా?"

"ప్రేమిస్తే సరి, ధైర్యానికేం బోలెడు వస్తుంది."

"నాకు ప్రేమంటే భయం... పిరికి దాన్ని" కోమలి బాధపడ్డది.

* * *

## 19

కోమలి కూడా వేసవిసెలవలకు ఇంటికి బయలుదేరింది. రైలులో ప్రయాణం చేస్తున్నంతసేపు మీనాక్షి జ్ఞాపకం

వస్తూనేవుంది. మద్రాసు వదలిరావడం అంటే, ఏదోబెంగ, అదేదో తన స్వంత ఊరైనట్లు దిగులు. అక్కడున్న ఏడా దిలో ఎంతో మార్పు వచ్చింది. "నేను ఎవర్నీ ప్రేమించలేదు, ఎవరూ నా ప్రేమను పొందలేదు. జీవితంలో 'ప్రేమ' అనేది ఒక కల్పన మాత్రమే. పుస్త కాలలో చదివినట్లు ఏ ప్రేమిలు క్షణా లలో కలిసిపోరు అనుకున్నది.

ఇంటికి వెళ్లగానే మద్రాసు మరచి పోయింది. ఇటు తల్లి, అటు శ్రీదేవి తన రాకకు ఎంతగానో సంతోషించారు. తాను ఎంతో పెరిగి, పెద్ద అయినట్లు ప్రత్యేక గౌరవం చూపిస్తున్నారు. ఇప్పుడు కాబోయే డాక్టరమ్మగా ఆ కుటుంబంలో, వ్యక్తులలో తనకొక ప్రత్యేకత ఏర్పడ్డది. మద్రాసులో తన చదువుల గురించి, జీవితంగురించి కథలు, కథలుగా చెప్పింది.

"నేను మారిపోయాను. వెనకటి కోమలిని కాను" అనుకున్నది.

కూతురి ముఖంలో కొత్త వెలుగు గమనించింది రజని. ఒకసారి మీనాక్షి ఉత్తరం రాసింది. అందులో రామ్ గురించి ఒక్క మాటకూడా లేదు. తన సంగతిగురించి వ్రాసింది. కోమలి, తన స్నేహితురాలు మీనాక్షిగురించి, ఆమె సినిమా కోరిక గురించి తల్లితో చెప్పింది.

"పరవాలేదు. ఇప్పుడు సినిమా వాళ్ళను జనం దేవుళ్ళకంటె ఎక్కువగా చూస్తున్నారు పెద్ద రాజకీయనాయకు లకు లేని గౌరవం సినిమావాళ్ళకున్నది పైగా లక్షలు సంపాదించ వీలున్నది. రజని తన అభిప్రాయం చెప్పింది.

"నాకిష్టంలేదమ్మా, చక్కగా చదివి ఏ ఉద్యోగమో, లేక సంసారమో చేసు కోవలసిన వాళ్ళు సినీమాలలో చేరడం ఏం బాగు అన్నది"

"అదేమిటి కోమలీ, ఇప్పుడు అదీ ఒక వృత్తి అయింది. డాక్టర్, టీచర్, మినిస్టర్ లాగా, సినిమా పెద్ద పరిశ్రమ గదా ?"

"వాల్లు చాలా ఫ్రీగా తిరుగుతారు టమ్మా సీతినియమాల పట్టింపులు ఉండవట" కోమలిబాధ అది.

"మన సమాజం ఒకప్పుడు ఫ్రీగానే ఉండేది. ఆ రోజుల్లో స్వేచ్ఛా ప్రణయం ఉండేది. ఎవరు, ఎవరితో పోయినా తప్పుకాదు మునిపత్నులను రాజులు ప్రేమించేవారు, అది తప్పుకాదు. వెన కటి రోజుల్లో స్త్రీకి ఆస్థి హక్కు, ఆర్థిక స్వేచ్ఛ, ప్రేమస్వేచ్ఛ ఉండేవి. ఒక్క మగాడికి ఆడది ఎప్పుడూ కట్టుబడి వుండేదికాదు. ఇప్పుడు నాగరికత పెరిగింది. దాంతో ఆచారాలు, నియమాలు ఎక్కువైనాయి. ప్రేమించడం తప్పు కాదు. స్త్రీ పురుషులు కలవడం శారీరక అవసరంకొద్దీ. ఇప్పుడే కులాలు, మతాలు వచ్చాయి. అసలు ఆదిమమానవు






లది ఒకే కులం. అది మానవ కులం"

తన తల్లి ఇంతచక్కగా వాదించగల దని కోమలికి తెలీదు. అమ్మ మారి పోయిందా అనుకుంది. కాదు అది ఆమెలో సహజంగా ఉన్న జ్ఞానమే. ఇంతకాలం నివురు అడుగున దాగివుంది.

సెలవలు అయిపోతున్నాయనగా. మీనాక్షి, విశాల జ్ఞాపకం వచ్చారు. వారిని ఎప్పుడెప్పుడు చూద్దామా అని మనసు తొందరపడుతున్నది. మీనాక్షి ధైర్యసాహసాలు చూస్తే, తనకు అడ్మి రేషన్ కలుగుతుంది. పైకి కోపగించినా, లోలోపల ఆమెను తను అభిమానిస్తుంది. అభిమానం సమర్థంకాదు. మీనాక్షి అమాయకురాలు. ఆమె అనుభవాలు, ఇతరులకు మంచి పాఠాలు నేర్పుతాయి.

తను తిరిగి వచ్చేసరికి హాస్టల్ నిండుగా కళకళలాడుతోంది. పిల్ల లందరూ వచ్చేశారు రెండవ సంవత్స రంలోకి. 'ఇందిర' అని ఓ అమ్మాయి, టి. సి. మీద వచ్చి చేరిందని మీనాక్షి చెప్పే సింది. అంతలోనే వార్డన్‌నుంచి కబురు వచ్చింది కోమలికి.

"ఈ అమ్మాయి ఇందిర. నీ గదిలో ఉంటుంది. మీ ఇద్దరూ కలిసి ఉండండి. వచ్చే ఏడాది నీలాగా మెడిసెన్ చదువు తుంది నాకు తెలిసిన అమ్మాయే" అని కోమలికి, ఇందిరను చూపించింది.

ఇందిర చాలా నాజూకైన పిల్ల. చామన చాయలో ఉన్నా, మంచి ఆకర్షణ గల ముఖం. చక్కని శరీర సౌందిక ఉంది. బాగా కలవారి అమ్మాయి. ఇంది రతో తనకు జతకుదురుతుందా అనిభయ పడ్డది. అయితే మీనాక్షి స్నేహం!

"మీరూ మెడిసెన్ చదవాలనా?" కోమలి అడిగింది.

''అవును. అది నా జీవితంలో ఏకైక లక్ష్యం."

"ఇదివరకు ఎక్కడ చదివారు?" చెప్పింది.

గదికివెళ్ళగానే మీనాక్షికి పరిచయం చేసింది. 'ఇందిర మనగదిలోనే ఉంటుంది.'

మీనాక్షి నిష్ఠూరంగా అన్నది, "తెలుసమ్మా, వరండా చివరిగది లేదూ, 'సెల్' అది నాకిచ్చింది, ఆ తాటకి. దానికి నేనంటే అసూయ. ఏడుపు మొహం "

"ఫరవాలేదు మీనా, దగ్గరగానే వుంటాం ఇదే బ్లాకు."

"నావల్ల మీకు ఇబ్బంది కలిగింది."

"ఐయాం సో సారీ మిస్...పోనీ వార్డెన్‌తోచెప్పి, నేనే ఆ 'సెల్' లోకి వెడతాను, ఏమంటారు?" ఇందిర సున్నితంగా అన్నది.

వొద్దులేండి, ఆవిడ ఒప్పుకోదు. మా కోమలి చదువులరాణి నేనేమో, ఎందుకులె, మీ ఇద్దరికీ జోడీ బాగుంటుందనేమో ఆవిడ మీ ఇద్దరినీ కలిపింది" మీనాక్షి తృప్తి చెందింది.

ఇందిర స్నేహపాత్రురాలే. అయినా మీనాక్షివలె బోలామనిషి కాదు. చాలా రిజర్వ్‌డ్‌గా వుంటుంది. విశాఖనుండి వచ్చింది. ఆమె బాగా డబ్బుగల అమ్మాయి ఆమె డబ్బుగలవాళ్ళకుండే ఖరీదైన సరదాలు చాలా వున్నాయి. ఆడంబరాలు కావాలి. సోషల్ గాదరింగ్స్ కావాలి. ఏదో విధంగా తనను అందరూ గుర్తించి, గౌరవించాలి. పొలిటికల్ మైండ్ ఇందిరది.

ఆడవాళ్ళు రాజకీయాలలో విరివిరిగా చేరి, దేశపరిపాలన చేపట్టాలనివాదిస్తుంది.

"ఆడవారికి రాజకీయా లెందుకు? సరదాగా బ్రతకగలిగితే చాలు." ఇది మీనాక్షి నిర్ణయం.

ఒకరోజున మీనాక్షి, దిగులుతో గదిలో కూర్చుని, కోమలికి కబురు పెట్టింది.

"ఏమైంది మీనా" అంటూ ఆత్రతగా వచ్చింది కోమలి.

"అయిపోయింది కోమలీ, ఆ రాయ్‌కి నేను పనికిరానట." ఏడ్చినంత పని చేసింది ఎవరితో చెప్పుకుని ఏడుస్తుంది. ఆ విషయం కాస్త కోమలికే తెలుసు.

"పోనీలే మీనా." ఊరడించ ప్రయత్నించింది. కాని మీనాక్షి రెచ్చిపోయింది.

"ఎందుకు పోనివ్వాలి. నేనేం అందగత్తెనుకానా? ఇప్పుడు నేను పనికిరాలేదు వెధవకి."

"నేనొక మాటచెబుతాను వింటావా మీనాక్షి."

"అందుకేగా నిన్ను పిలిచింది."

"నువ్వు నిజంగా అతన్ని ప్రేమించలేదని నా అనుమానం. కేవలం వాంఛించావు. ప్రేమ వేరు. అతనూ అంతే. నీ యవ్వనం, చలాకీతనం రుచి చూచాడు."

మీనాక్షి వెక్కి వెక్కి ఏడ్చింది. ఆమెను, ఆమె ఏడుపును చూస్తుంటే కోమలికి ఏమాత్రం జాలి కలుగలేదు. బాగా నవ్వు వచ్చింది.

ఆ ఏడాది ఇట్టే గడిచిపోయింది. ఒకరోజున కోమలి పేర అమెరికానుండి ఓ కవరు వచ్చింది. అది కిరీటి వ్రాసింది. ఆ ఉత్తరం చేతిలోకి తీసుకోగానే, ఒల్లు పులకరించింది.

''డియర్ కోమలీ,

మన పెళ్ళి అయి రెండేళ్ళు కావస్తోంది. కానీ రెండు శతాబ్దాలు గడిచినట్లుందినాకు. నిన్ను మరిచిపోలేను. నేను ఎప్పటికీ నీవాణ్నే. మరిచిపోవద్దు. కాలేజీలో చదువుతున్నావు గనక ఇప్పటికి నాగురించి సక్రమంగా ఆలోచించగలవు. నన్ను అర్థంచేసుకో. నీ హృదయంలో నాకు స్థానం యివ్వు. నీ హృదయంలో వికసించిన ఒక ప్రేమ పుష్పాన్ని నేను. ఈ ఉత్తరం వ్రాసినట్లు ఎవరికీ చెప్పవద్దు."

-కిరీటి"

కోమలి ఆ ఉత్తరం చదివి, చించి, ముక్కలు చేసింది. జవాబు వ్రాయలేదు. కిరీటిని మరచిపోవాలని ప్రయత్నించింది. అనుకోకుండా వచ్చిన ఉత్తరం, హృదయంలో ఆరిపోతున్న మంటను రెచ్చకొట్టింది. కోపం తెప్పించింది. ఒక్కసారిమాత్రం అతని గురించి విశాలతో చెప్పింది ఇంకెవరికీ తమ విషయం తెలియదు. తర్వాత కిరీటిని గురించిన ఆలోచనే రాలేదు. ఎందుకో ఆ ఉత్తరం ఒక ముల్లులాగుచ్చుకుని, గుండెలో మంట పుట్టిస్తోంది. తన రహస్యమందిరం తలుపులు ఎవరో, బలవంతంగా బద్ధలు కొడుతున్న భావన కలిగింది.

'నేను ఏకాకిని, కిరీటికి ఏమీ కాను, అతను నాకు ఏమీకాడు. అతన్ని మరచిపోతాను. అతనికీ, నాకూ ఏమిటి సంబంధం" అని పదేపదే అనుకున్నది.

ఇంటికి వెళ్లినప్పుడు కిరీటి వ్రాసిన ఉత్తరం గురించి తల్లికి చెప్పకుండా దాచలేకపోయింది.

''నేనేం సమాధానం రాయలేదమ్మా! బలే కోపం వచ్చింది, ఉత్తరం చూడగానే జవాబు రాయాలనిపించలేదు" అన్నది.

"నీ ఇష్టం కోమలీ, అన్నీ తెలిసినదానివి. నీ మనస్సుకు ఏది మంచిదని తోస్తే అలాగే చెయ్యమ్మా ఆవేపు నుంచి కూడా ఆలోచించు" సలహా చెప్పింది రజని, తల్లిగా, స్నేహితురాలిగా.

"ఏమిటమ్మా ఇంకా ఆలోచించేది?

ఎప్పుడో తెగిపోయింది. నా విషయంలో అతని జోక్యం సహించేదిలేదు.

"జోక్యం ! మనం మనుషులం కోమలీ, సంఘంలో, సమాజ జీవులంగా బ్రతికి ఉన్నంతకాలం, అడుగడుగునా, ఇతరుల జోక్యం ఉండితీరుతుంది తల్లీ. ఎవరికీ కాకుండా బ్రతకలేం. అతనంటే ప్రేమ లేదనుకో, కనీసం సానుభూతి చూపలేవా ?"

"నా గుండె రాయిచేసుకున్నానమ్మా"

"నీకంటే చిన్నదైనా, శోభ నయం. పధ్నాలుగేళ్ల పిల్ల, దానికెంత ధైర్యం.

"ఏమిటమ్మా, శోభ అంటున్నావ్. నా పెళ్లి చేస్తున్నావా ఏమిటి" శోభ వస్తూనే అన్నది

"అప్పుడే పెళ్లి కావాలా ? చేశాంగా ఒక పెళ్లి...ఏదో సామెత చెప్పినట్లు వేసిందే గంతు."

"నేనేమీ, అక్కలాగా పిరికిదాన్ని కానులేమ్మా. నాకు చదువురాదు. పోనీ పెళ్లిఅయినా చేసుకుంటాను. అక్కయ్య లాగా, కొర్కెల్ని ఏండబెట్టి బరుగు చేసుకోలేను'' శోభ, ఖండితంగా చెప్పింది.

తను అలాగ ఏనాడు మాట్లాడేది కాదు అనుకుంది కోమలి

"ఛీ, నోర్ముయ్ సిగ్గులేకపోతేసరి.." రజని కోప్పడ్డది. ఆ కోపం నిజంగా శోభమీదకాదు, కోమలిమీద. అలాగైనా సిగ్గుపడి దారికొస్తుందని ఆశ.

శోభ ధైర్యానికి కోమలి ఆశ్చర్య పడ్డది తన కళ్లముందు పుట్టి పెరిగిన పిల్ల. తన చేతులతో ఎత్తి పెంచిన పిల్ల, ఎంత ఆరిందా అయింది! తనను మించి పోయింది. జీవితాన్ని తనకంటే బాగా అర్థంచేసుకున్నది. అందరూ తనలాగే వుండరు. ఉండలేరు. వయస్సు ఎంత మార్పు తెస్తుంది. అందునా ఆడపిల్ల ఈడేరే వయస్సులో, పరిణత చెందు తుంది. ఆ వయస్సు కొత్త కోర్కెల్ని, వాంఛల్ని కలిగిస్తుంది.

'నాకు మనుషుల్ని అర్థంచేసుకోవటం చాతకాదు. నేను అందురాలిని. నాలో మార్పు రాదు నేను మానసికంగా ఎదగలేదు. వయస్సుతోపాటు మనస్సు పెరగలేదు. పెళ్లిచేసుకుని, సుఖపడవలసిందిపోయి, కోరి కష్టాలలో, సమస్యలలో చిక్కుకున్నాను. కనీసం స్నేహితురాళ్లను చూచి కూడా నేను మారలేకపోతున్నాను.'

తనలో తనే మధన పడ్డది కోమలి

( స శే షం )



# కథాసరిత్సాగరం

పాలగు

## 1

**లేఖకురాలు కావలెను**

తెలుగు దస్తూరి బాగుండాలి.

రచన నేర్చివుంటే మరీమంచిది.

500 అయిదువందలు రూపాయలు నెల జీతం!

కశింకోట ఊరు,

ఊరు నడిరోడ్డుచివర,

శారదానది ఒడ్డున,

'నందనం'కి వచ్చి తేల్చుకోవచ్చు

అదీ ప్రకటన. అక్కడికి చేరేముందు దేనికైనా మంచిదని మరోసారి చదివింది రిక్షా ఆగింది. ట్రంకురోడ్డు దిగితే ఊళ్లోకి రస్తా.

"ఊళ్లోకి పోనీయ్! ఏటివొడ్డుకి..."

*  *  *

"నందనం యిదేకదండీ?" రిక్షా దిగుతూ అడిగింది. అతను అటు తిరిగి, "రండి! రండి!..." అంటూ లోపలకు దారితీశాడు.

*  *  *

"నేను చెప్పడం - మీరు రాయడం, అంతే!" నేను చెప్పేవి కథలు. నోటి కొచ్చినట్టల్లా జోరుగా చెప్పుకుపోతూం టాను. మీరువాటిని చదవడానికి బాగుండే లాగ వ్రాయాలి. అంతా విన్నాకనూ రాయవచ్చు, యేదీ వదిలేయకుండా,... ఇహ...చెప్తున్నాను!...

'పసుపు రాసుకున్న ముఖానికి టాల్కంపౌడరు అద్దుకుంటున్న మగువ'- కశింకోట; ఊరంటే ఊరే, పల్లె అంటే పల్లెటూరే. ఆ ఊరుచివర - నందనం. వాడు నిల్చుని పల్చగా పారుతున్న యేటివంకా నీలపుకొండ దూరపు నునుపు వంకా చూస్తూ రిక్షా నడికి అటు చూడగా ఆమె రిక్షాదిగుతూ 'నందనం' పేరున్న అట్టముక్క చూస్తూనే నందనం యిదే కదండీ అని అడిగింది. నందనం ఏదో అట్టహాసంగా ఉంటుందని ఊహించుకొని ఉండొచ్చు, కాని, మొగలాయీలనాటి ఒకపాత డాబాఇల్లు, చుట్టూరా అరటి వనం, మందారచెట్లూ మల్లెపందిరీ యింటి మొగసాల అరణ్యంలా పెరిగి విరగ బూచిన ముద్దబంతి చెట్లూ, గేటు అనుకో వలసిన వెదుళ్ళకట్టూ చూసి సందేహంలో పడి ఉంటుంది.

వాడి పేరామెకి ఆమె పేరు వాడికి అవసరం లేకుండానే వచ్చిన పని కొంత తేలింది..."

"ఔను మీ పేరు నాకు తెలీదు,"... అందామె. ఆమె మాటలతను వింటూనే



కెరటంమీద కెరటం విరుచుకుంటున్నట్లు, "వాడు తనపేరు చెప్పాలనుకుంటూనే చెప్పలేదు. వీడిపేరు ఏదైతే నాకేం అనుకుంటూండవచ్చు...."

"లేదు, చెప్పండి!"

"మీ ఇష్టంవొచ్చిన పేరెట్టవచ్చు, ఎలాపిల్చినా పలుకుతాను!"

"......'సాగరం' - అంటాను!" అందామె.

"'సాగరం' - సాగరం... బాగా



ఉంది... 'కథానందసాగరం'... అదీ బాగుంటుంది! ఈ చిన్న సైజు టేబిల్ టాప్ భూలోక నందన దేవతా వనం నందనం కొద్దిరోజుల్లో 'కథానందనం' నిలయంగా మారబోతోంది కథానందనం ముద్రతో కేవలం కథలతో ప్రచురణలు వెలువడతాయి. కట్టాడు, కొట్టాడు, తెచ్చాడు లాంటి ఆ కథల్ని పెంచి నవలలు పండించుకోవచ్చు. పొడిగించి సినిమా కథలు చేసుకోవచ్చు. చిలుకు దిద్దీ సింహాచలం శిల్పంలాంటి కథలు కథాని కలుగా మార్చుకోవచ్చు. వినోదం

వ్యంగ్యం ఒకటేమిటి నవరసాలూ విత్త నాల గింజలుగా ఉంటాయి. పిల్లల్నేయిం చని గ్రుడ్లు; ఆకారం చెక్కని శిల్పాలు; అంటే సరుకుకోసం వెతుకుతున్న వాళ్లకి ముడిసరుకు సప్లయి చేస్తాయన్నమాట. అన్ని హక్కులూ అందరికోసం వదులుకో

బడినవన్నమాట. పెద్దపెద్దవాటిని కుదించి 'సంక్షిప్తం' అంటున్నారే అలాంటివీ ఆ పుస్తకాల కథలుగా రావచ్చు. ఇటువంటి ప్రయత్నం-యితర భాషలసంగతి నాకు తెలీదుగాని - మన తెలుగులో మట్టుకు ఇదే మొదలు...కాలం కలిసొస్తే..., అప్పుడు వాడు తన పేరు 'కథానందం' అని వేసుకోవాలనుకున్నాడు. ఇప్పుడిపుడే 'కదానందసాగరం' అని కొంచెం కలుపుకున్నాడు, అంతవరకు వాడిప్పటికి తనపేరు 'సాగరం' అని తగ్గించుకుంటున్నాడు. ఇక్కడ్నించీ వాడి పేరు సాగరం...

...సాగరం అసలు పేరు ఆనంద మూర్తిలో మూర్తి ఊడిపోయి తోకతెగిన నక్కలాగ ఆనందం అనిపించుకుంటూ ఇప్పుడిపుడే సాగరంగా అవతారం మార్చింది..."

"మీ పేరు ఆనందం అన్నమాట !"

"కాదు-'సాగరం'-భూత భవిష్యత్ పేర్లన్నీ వాడు మర్చిపోతూన్నాడు, ఇహనించి వాడిపేరు సాగరం మీరేదో కొంచెం రాసినట్టుందిలా యివ్వండి..."

ఆమె ఇబ్బంది చూస్తూ అతను నవ్వుతూ, "ఆరంభంలోనే కొంచెం తికమక పడ్డారు - కశింకోట ఊళ్లోని మగువ అనే ఆమె పసుపు రాసుకొని పౌడరు అద్దుకుంటుంది — అని వ్రాశారు; ఊళ్లో సరికొత్త తీరులు ప్రవేశిస్తూన్నాయన్న విషయాన్ని అలాగ చెప్పాను, మీరేకవిత్వాలూ కావ్యాలంకారాలు తెలిసినవారై ఉంటే ఊర్పు మగువ అన్నానని పసుపు పాతకూ, పౌడరు కొత్తకూ గుర్తులుగా వాడానని అర్థంచేసుకుని రాసుండేవారు,...'వాడు' 'వాడికి' అని చెప్పింది చెప్పినట్టుగానే వాడు వాడికి అనే వ్రాశారుగాని, పాపం వాడిమీద కనికరించి అయినా, మీరే ఏ రచయిత్రో, కథకురాలో కనీసం కథలూ అవీ చదివి చదివి వంటబట్టించుకున్నవారై ఉంటే - ఒక యువకుడు అనో, ఒకాయన, అందగాడు కాకపోయినా కురూపికాని ముప్పైయేళ్ళ లోపు వ్యక్తి అనో రాసుండేవారు-ఫరవా లేదులెండి, మీరే అద్భుతంగా రాసే కాలం ముందుముందుంది !...కవితలూ, గేయాలు, మాటల గారడీలు, సాహిత్యం సర్కస్‌లూ ఇప్పుడు అనవసరం అని నమ్మేవాడిని నేను ! తెలుగు చదవగల మామ్మూలు ప్రతీవారికీ ఎంత గొప్ప విషయాన్నైనా తేలికగా బోధపడేలా చెప్పగల వచనం ఒక్కటే చివరవరకూ అవసరం అని నాకు గట్టినమ్మకం.— లేకుంటే నేనే ఒక గేయరచయితనైతే మీ చేత వ్రాయించి అలాగే బ్లాకులు చేయించి అచ్చువేయాలన్నట్లుగా ఉంది మీ దస్తూరి," అంటూ ఆగాడు.

ప్రకటనలో ఉన్నవాటిల్లో అదొక్కటే నాకున్న అర్హత...," తనలో తానను కున్నట్లుగా అందామె.

అతను పది కాగితాలు బల్లమీద పెట్టి



"అడ్వాన్సుగా నెలజీతం, మరో ఐదు ధరావత్తుగా - ఉంచండి," అన్నాడు. ఆమె మరేమీ అనకుండా తీసి సంచిలో పెట్టుకుంది, "ఇది రెండో అర్హత," అని గట్టిగానే అంది.

"నా వాలకం అదీచూసి, వీడేం అయిదొందలు జీతం యిస్తాడు ?! అని అనుకున్నారేమో, కాని నన్ను నమ్మవచ్చు తర్వాత తర్వాత తెలుస్తుంది, యెందుకు నమ్మొచ్చో...మిమ్మల్ని పూర్తిగా నమ్ముతున్నాను, మీకు వీలున్నప్పుడల్లా రావచ్చు (రాయొచ్చు) వింటూండొచ్చు- అన్నట్టు... మరిచాను...," అంటూ అతను లోపలికెళ్ళి తీసుకొచ్చాడు, వెండి

గళాసుల్తో శారదానది చలాలనీళ్లూ, వెండి గిన్నెల్లో తినుబండారాల్నీ, వెండి మర చెంబునిండా కాఫీకూడా.

"ఇవి పెరుగ్గారెలు-మాఅవ్వతయారీ. ఈ ఇల్లు మా అవ్వదే. యీ ఊళ్లో యింకొన్ని ఉన్నాయి. మంచి ఆస్తేఉంది. భూమీ అవీ-నేను ఏకైక వారసుణ్ణి;... అవి జంతికలు! 'బల్ల' అనే యంత్రం నుండి వచ్చింది కాబట్టి 'యంత్రిక'— 'జంత్రిక' అన్న సంస్కృతశబ్దం జంతిక అయిందంటారు. ఈ గ్రామం జంతికలకు పెట్టింది పేరు. యంత్రాల్లాగ ఆడవాళ్లు విసుగూ విరామం లేకుండా ఆవిర్లుగక్కే నూనెపెనాలముందు ప్రకృతి పురుష ల్లాంటి 'బల్ల' 'గుడబ'లతో దుంపలపిండి ముద్దలు జంతికలు తిప్పుతూనే ఉంటారు. కర్రపెండలం మొదలైన దుంపజాతిని ఎండబెట్టి మిల్లాడిన పిండి ఎమ్మోనియా ఎరువుతో కలగలిపి పంటలకు జల్లేందుకు పుట్టింది మొదట. దాన్ని కిమ్మత్తుగా ఉందని మినప్పిండితో బియ్యప్పిండికి బదులు కలిపి జంతికల పరిశ్రమకు ముఖ్యాధారంగా చేసుకున్నారు-అటువంటి దుంపల పిండిలో ఉన్న ఘనమైన ఆహారపు విలువలు గుర్తింపబడి ఇప్పుడు ఘనమైన ప్రజారాజ్యంలో రేషన్లు గా యిస్తున్నవాటిలో ఒకటిగా చేర్చబడి అందజేయబడుతూన్నది. అటువంటి ఘన మైన పిండితో తయారైన జంతికలు యివి! మీరు తింటారని కాదు, యీ గ్రామం ప్రత్యేకతలు మీకు తెలిసి ఉండడంకూడా మంచిదే గదా అని పెట్టాను. ఇంతకంటే మంచి టిఫిన్లు యీ ఊళ్లో దుర్లభం. ఇలాంటి ఆతిథ్యం మీరెప్పుడూ చూడలేదు, చూడబోరు, మరచిపోలేరనికూడ అంటాను..."

ఆమె ఆ రెండూ ఉన్నది. జంతిక ఒక్కటే తినగల్గింది. తర్వాత ఇద్దరూ కాఫీలు త్రాగారు.

"మీరు యిక్కడికివచ్చి ఉంటానంటే యీ ఊళ్ళోనే మంచిఇల్లుచూసిఉంచాను. మీకు సదుపాయాలన్నీ ఉంటవి అద్దె లేదు. అఖ్ఖర్లేకపోతే చెప్పెయ్యండి-యిప్పుడు కాదు-తర్వాత...తర్వాత... మీరు నన్ను మరొకలాగకూడ అనుమా నిస్తూండవచ్చు - అటువంటి అనుమానం వద్దేవద్దు!-, ఇంతకూ మీరు నాకు-ప్రవాహం కనబడకుండా నిండుగా ఉన్న గోదావరి — లాగ కనిపిస్తున్నారంతే!, అంతే!..."

"గోదావరి!!!...నా పేరు మీకెలాగ తెల్సు?!" అందామె ఆశ్చర్యంగా కళ్ళని తేరిపార చూస్తూ

"మీ పేరు 'గోదావరి' అని నాకు తెలీదు-కాని-తెలిసిపోయిం.!" అన్నాడు.

ఆమె తలవంచుకుని పేడ అలికిన నేల, నేలమీద బియ్యప్పిండి ముగ్గు, ముగ్గు రవ్వ కరుచుకుపోతూన్న చీమను చూస్తూంది...

ఆమె వెళ్ళింది.

* * *



## 2

రెండ్రోజుల తర్వాత గోదావరి వచ్చింది.

"మీ ఊరికి వెళ్లి వచ్చారు గదూ?..."

ఔనన్నట్లు చూసి గోదావరి, "కథ చెప్తారా?" అన్నది.

"చెప్తాను, మెల్ల మెల్లగా తాపీగా చెప్తాను. నే చెప్తుంటే మీరెలాగ రాస్తారో చూడాలి గదా మరి..."

"అలాగే..."

"చెప్తున్నాను - రాయండి ...యిదే తొలిపూజ గదూ...;

...'అది కైలాసం. పార్వతీ పర

మేశ్వరుల నిలయం. అమ్మగారు ఇంటికి రాదు. అయ్యగారెక్కడికో వేంచేశారు. వంట కుమారస్వామి నెత్తిన బడింది. ఎగవేసే మార్గం ఆలోచిస్తూండగా— విఘ్నదేవర బొజ్జ మోసుకుంటూ దిగ బడ్డాడు. స్కంధుడు విఘ్నవినాయ కుడికా బాధ్యత అప్పగించి నెమలి యెక్కి తుర్రుమని జారుకున్నాడు.

వండి పెడితే తినడం ఒక్కటీ తెలిసిన గణపయ్య ఈ కూరా ఆ కాయా ఉల్లీ గిల్లీ రొడ్డ గడ్డా పప్పుతో సహా అన్ని టినీ ఉడకేసి బండెడు చింతపండూ కొండంత ఇంగువా బ్రహ్మాండమైన కారము ఉప్పూ బెల్లమూ మిరియం ఒకటేమిటి వంటింటి సమస్తమూ అందులో గుమ్మరించి జారుజారుగా ఉన్న ఒకే ఒకవంటకాన్ని దించి ఉస్సు రంటూ తొండంతో చెమట తుడుచు కున్నాడు.

హాలాహలాన్ని మింగగా పుట్టు కొచ్చిన బ్రహాండమైన ఆకలితో ఆవురావు రంటూ అప్పుడే వచ్చిన సాంబమూర్తి ఇల్లంతా ఇంగువ వాసనలు గుబాళిస్తున్న, దాన్ని జుర్రి ఆ రుచికి, ఆ సరి కొత్తవంట కళకూ అహా! అంటూ ఉబ్బి తబ్బిబ్బై ఉబ్బులింగడయ్యాడు. నారదుడూ అప్పుడే దిగాడు.

మురుగడు 'పార్వతి' మన వినాయ కుడు, నారదుడితో సహా అంతా ఊడ్చుకుతిన్నాక, ''ఇప్పాకరత్నంబు పేరెన్ను?'' అని కలహభోజనుడు చర్చ లేవదీశాడు.

"ఇమ్మహా వంటకాన్ని చేసింది నేను!", అన్నాడు వినాయక పుళ్లైయారు సగర్వంగా తొండం బిగించి పైకెత్తి.

"పురమాయించింది నేనై ఉంటిని గదా!'' అంటూ వేలాయుధంతో నేల గుద్ది ముందుకొచ్చాడు వేలు.

అప్పుడు జగన్మాత, ''ఇటువంటి ఘన దివ్యపాకానికి ఏదో పేరు పెట్ట డానికి వీల్లేదు. మొదట రుచి చూసింది సాంబశివులవారే గనక, వారికే అంకి తంగా సాంబశబ్దార్థకమై-సాంబారు-అని పిలవాలి," అని ప్రతిపాదించింది. 'సాంబారు' అని ఖాయపర్చడం జరిగింది.

"ఈ పాకాన్ని సేవించితే శివసా యుజ్యం తప్పదు గాక," అని శివుడు వరం యిచ్చాడు.

"ఇయ్యది నారీలోకానికి శ్రమ తగ్గించే వెయ్యి వంటల పెట్టుగా వర్ధిల్లు తుంది. ఇంట్లో దీన్ని చేస్తే మగవారు హోటళ్లకు వెళ్లరు," అని పార్వతి,

"నన్ను ప్రధానదైవంగా ఆరాధించే ప్రజకు ఇస్సాంబారు వారి సొత్తై ప్రధాన జాతీయ పాకమై వెలయుగాత," అని ఆరుముగంస్వామి,

''ఈ ప్రతాపమంతా నాదే గనక, నా ప్రియమైన ఇడ్లీలనబడే కుడుములు దీనిలో ముంచి పరగడుపు నింపుకొంటే

ఎట్టి విఘ్నములు ఉండవు. సాంబారుతో ఉదరము పూరించితే నన్ను పూజించిన ఫలము'' అని విఘ్నేశ్వరుడు వరాలు యిచ్చారు.

"ఈ కథ చెప్పినా, విన్నా, రాసినా, చదివినా నిర్విఘ్న సంకల్ప సిద్ధి, విజయం, కళ్యాణ ప్రాప్తి, సర్వశుభములు, శివసాన్నిధ్యం కలుగును," అంటూ మంగళం పాడుతూ ముల్లోకాలూ తిరిగాడు." -చెప్పడం ముగించి సాగరం గోదావరివంక చూశాడు. గోదావరి రాయడం పూర్తిచేస్తూఉంది. "అరె! అనుకోకుండా పాతాచారంగా తొలి కథ వినాయక పరంగా వచ్చిందే!! ఐతే కథానందసాగరం నిరాటంకంగా సాగుతుందన్నమాటే. మీరు రాయడం కూడా బాగా రాశారని చూడకుండానే చెప్పేస్తున్నాను యింకా, రాస్తారు అని కూడా. గణపడి పేరెత్తితే విఘ్నాలుండవుటగా మరి...'' అంటూ సాగరం లోపలికెళ్లాడు.

## 3

"చెప్పుతున్నాను, వినండి......

సాగరం ఒక ప్రతికా దివాణంలో ముప్పై రూపాయలు జీతం ఎగిరి అందుకుంటూ పనిచేస్తున్నాడప్పుడు.

అక్కడ ఓ పదిమంది కూడి తలా రూపాయి వేసుకొని నెలనెలా పదిలాటరీ టిక్కట్లు కొంటూండేవారు, పాండవుల్లాగ సమానంగా పంచుకుందామని. ఆ దశకంఠ సిండికేటులో సాగరం ఒకడు. మొదట్లో లక్షామత్స్యయంత్రాన్ని కొట్టేస్తున్నంత సరదాగా, ఆ పాంచాలిని ప . ముక్కల్నరికి తలోపదేసి వేలూ జేబుల్లో వేసుకోబోతూన్నట్లుండేదల్లా ఏడుస్తూ రూపాయివ్వడం కాడి కొచ్చింది.

పదిమందిలో శకునిగారు ఒకడు. మూడొందల జీతగాడు. అది అతని అసలు పేరు కాదు. గిట్టనివాళ్లు పెట్టిన పేరది. పరోక్షంలో శకునిగాడు అంటుంటారు. శకునిగారూ! అని పలకరించుతూనూ ఉంటారు. జిత్తులమారి నక్క అంటే తామెంతో గొప్ప రాజకీయ చాణక్యులమై పోయినట్లుగా పొంగిపోయేవారుండరూ, అలాగ శకుని అనిపించుకోవడం అతనికి సరదాగానే ఉండేది. తక్కువ జీతగాళ్లంటే శకుని ఎందుకనో చిరచిరలాడుతుంటాడు. సాగరంమీదా, సాగరానికి తోడు నీడలాంటి ఆఫీస్ బాయ్ బాబూరావు మీదా శకునిగారి కటాక్ష వీక్షణాలు పాపానికైనా పడేవిగావు.

తారాబలాలు, సంఖ్యాబలాల మీద గట్టినమ్మకమే గాకుండా ఆ శాస్త్రాల్లో మంచిప్రవేశం తనకు ఉందంటుంటాడు శకుని. ఒకనాడు గొప్పసంగతి బయట పెట్టాడు. అదేమిటంటే ఒకడి శని మిగతావాళ్ల శుభగ్రహాల శక్తినంతట్నీ హరించేస్తున్నది. ఒకడి సుడి తొమ్మిది

నిచ్చెన్ల మీదా పెద్ద పాములాగ మింగేస్తు న్నదిట. "ఎవరా సుడిగాడు ?" అను కున్నారు. అది తేల్చడానికే అ దరి పేర్ల సంఖ్యాబలాలు తారాబలాలు అహోరాత్రాలు గుణించి గణించి భాగిస్తూ పరిశీలిస్తున్నాడట శకుని, బాబూ రావు చెప్పాడు.

మామ్మూలుగా కొత్త రాఫిల్ టిక్కట్లు కొనడానికి సాగరం జీతం తీసుకున్న నాడే తనొంతు రూపాయి ఇవ్వబోతే, "అయ్యో, అప్పుడే కొన్నాం అన్నీ. నీ సంగతే మర్చిపోయావోయ్. వచ్చే తూరిద్దువుగాన్లే" అంటూ నసుగుతూ చెప్పాడు దశకంఠ సిండికేటు నిర్వాహకుడు శంకర్ ప్రసాద్ దయాళ్. సాగరానికి అర్థమైంది, మొదట చిన్న బుచ్చుకున్నాడేగాని, తర్వాత నిజమే అయి ఉంటుంది, తను నష్టజాతకుడు కాబట్టే దేశదిమ్మరిగా ఊళ్లు పట్టి ఆఫీస్ బాయ్‌కంటే తక్కువ జీతంకి నౌకరీ చేస్తున్నాడు. తన శని ఎవర్నీ అంటకూ వదు. అంటనియ్యదం తన చెప్పే...అను కున్నాడు. అలా అనుకుంటూనే రూపాయి చేత్తో పట్టుకునే అలా నడుస్తూన్నాడు. రూపాయి టిక్కెట్ తొంభై పైసాలే ! అంటూ అరవలేక అరుస్తున్న పదేళ్ల మ్మాయి కిరసనాయిలు దీపంబుడ్డీ వెలుగులో లాటరీ టిక్కట్టు దొంతులు పేవ్‌మెంటు సిమెంటు రాయిమీద పర్చుకుని, ఒక్కరైనా కొనరా ? అన్నట్టు ఇటటూ చూస్తూ కనిపించింది. ఆ అమ్మి మొగాన్ని చూసో స్వరాన్ని వినో సాగరం రూపాయి కాయితం అలాగే పడేశాడు. ఆ అమ్మాయే టిక్కట్టొకటి చేతిలో పెట్టింది. నిర్లక్ష్యంగా దాన్ని జేబులో కుక్కేశాడు. "పది పైసలు యిందండీ"... వినిపించుకోకుండానే నడిచిపోయాడు.

* * *

డ్రా తేదీ మర్నాడు పత్రికానిలయం సందడిగా ఉంది. శలవుపెట్టి, మరి అవసరంలేక ఊరికే ఉండలేక సాగరం వచ్చేశాడు కొంచెం ఆలస్యంగా. లక్షా వచ్చేసి ఉంటుందనుకున్నాడు వాళ్లకి. కాని శకుని మాటలు మరోలా విన వచ్చాయి. ''చూశారా ! నే చెప్పలేదూ, శాస్త్రాలూరిక పుట్టలేదు—ఈ వందా వెనుకరాబోతూన్న బంపరు విమానానికి దారిచూపే పైలట్ విమానం అన్నమాట."

తొమ్మిది టిక్కెట్లలో ఓదానికి నూరు రూపాయలు పేలాయిట, పేపర్లో ముఖంపెట్టి చూస్తూన్న బాబూరావు చెప్పాడు నిజమే, ముమ్మాటికీ తను శనిగాడే. మొదట్నించీ తను లేకుండా ఉంటే పాపం వాళ్ళకి యిప్పుడొచ్చిన వందకుబదులు లక్షా వచ్చేసి ఉండేది. సుడిగాడి దగ్గిర టిక్కట్టెందుకు? సాగరం జేబులో నోట్‌బుక్ తీసి గట్టిగా దులిపాడు. దాన్ని చించేద్దామనో పారే



ద్దామనో. ఆ దులుపుకి నోట్‌బుక్‌లోంచి జారిన టిక్కెట్టు బాబూరావు దగ్గిరికెళ్ళి పడింది. బాబూరావు దాన్ని చూశాడు. (మళ్ళీ పేపర్లోచూశాడు. పాము కాటేసిన వాడిలా కేకపెట్టి, గబ గబా ఆ టిక్కెట్టు సాగరం జేబులోకుక్కి సాగరాన్ని నెట్టుకుంటూ, వెళ్ళిపో సాగరం, వెళ్ళిపో. చప్పున ఇక్కడ్నించి వెళ్ళిపో..." అంటూ బైటకుపంపేసి పరుగెత్తుకుంటూ లోపలికెళ్ళి పెద్ద కేకలు పెడుతున్నాడు. "సాగరానికి లక్ష, మన సాగరానికి లక్ష..." అంటూ వినిపిస్తున్నాయి తిరిగివెళ్ళిపోతూన్న సాగరానికి...

* * *

ఆ తర్వాత తంతు నెమ్మదిగా పూర్తయింది. ఇల్లుకట్టుకోడానికి బాబూరావుకి ఐదువేలు యిచ్చాడు, సాగరం. టిక్కెట్టు చేతిలోపెట్టిన అమ్మాయికి ఎంతైనా యిద్దామనుకున్నాడు, దొరకలేదు.

మిగతావాళ్ళు శకునిని నిలదీసి అడిగితే, "అదే శనిగాడి మహాత్యం; నలుగురుతో కలిస్తే శని, ఒక్కడూ విడిపోతే బంగారం ఖని! ఎత్తేస్తాడు, అని సమర్థించుకున్నాడట. పదేసి వేలూ పడగొట్టాడన్నట్లుగా శకున్ని ఇప్పటికీ కొరకొరా చూస్తూనే ఉంటారటవాళ్ళు. బాబూరావే రాశాడు.

సాగరం కాక మరొకడైతే శకుని ఫోటో పెద్దది పటంకట్టించి రోజూదానికి దణ్ణంపెట్టుకొనేవాడే.

* * *

ఆకలి లేనివాడిముందు ఉండాతో అండాడు ప్రసాదం పెట్టినట్టుంది. సాగరానికి పెద్ద సంతోషం కలగలేదు సరిగదా, ఎంతోమంది జేబులు కొట్టిన పక్కాదొంగలాగ ఊళ్ళోతిరగలేనంతగా సిగ్గుపడిపోయాడు.

కొంతమంది చేరి సిన్మా తీస్తున్నాం! వాటా చేరమన్నారు. ఇప్పుడిప్పుడే రేఖ పుటకరిస్తున్నది. యింకా పోడుగెదు గుడ్డి. జాక్‌పాట్ గుర్రప్పందేలషీదా విరుచుకు పడమన్నాడొక సాముద్రికుడు. ఇంకా యింకా చాలామంది చాలా చాలా చెప్పారు గాని, బాబూరావు చెప్పిందే నచ్చింది. ముందు అవ్వ దగ్గిరి కెళ్ళమన్నాడు. అవ్వ కశింకోటలో ఉంది. ఉందో లేదో...దారిలోనే గోదావరి ఉంది. గోదావరి అంటే సాగరానికి మనసు పులకరిస్తుంది. కొన్నాళ్లా ప్రాంతాల్లో గడిపాడు. సాగరానికి ఉత్సాహంపుట్టింది.

సాదా మూడో తరగతి పెట్టె ఎక్కాడు. మామ్మూలు రకరకాల మనుషులు, వాళ్ళ మధ్య ప్రయాణమంటే సాగరానికి చాలా యిష్టం."

## 4

"చెప్తున్నాను, వినండి......

సాగరం పనిచేసిన పత్రికా కదనంలో ఒక మహానుభావుడున్నాడు. ఆయన పెట్టినకలం తియ్యకుండా రోజుకి పదికథలు వ్రాసేవాడు. ఒక్క కొట్టివేతగాని, హంసపాదుగాని ఉండేదిగాదు. వెతికిన పొల్లుమాట కనిపించదిగాదు, అంతటి మేధావి ఆయన. ఆయనకథల్ని సాగరం చదువుతూండేవాడు. కథలు రాస్తే ఇలాగే రాయాలి అనిపించేవి. పులినిచూచి నక్కకు వాతలు పెట్టుకోవా లనిపించినట్లుగా సాగరానికి కథలు రాయాలనే కోరిక బలంగా పట్టుకుంది. అంతేగాకుండా తలలో ఎన్నోకథలు పుట్టుకొస్తుండేవి. కథల్లాంటి కలలొస్తుండేవి. సినిమాలు చూస్తున్నపుడు, యీ కథనే మరికొంత



బాగుచేసి ఇంకా బాగా రక్తికట్టించొచ్చునే అనిపిస్తుండేది. ఇంతకంటే మంచికథలు స్వతంత్రంగా ఊహించి వ్రాయవచ్చు. అలా రాసినవీ ఉన్నాయి, రాసేవారూ ఉన్నారనుకుంటుండేవాడు. తన ఊహలో ఏదోకథ వస్తే ఎవరికో చెప్పేవాడు. వాళ్ళు చాలాబాగుంటుందోయ్! రాయ వోయ్! అనేవాళ్ళు; ఉత్సాహంతో రాయబోయేవాడు. రాత సాగేదికాదు, రాసింది యింకా బాగారాయాలనిపించేది. కాగితాలు పాడయేవి. సగం సగంరాసి దస్తాలు దస్తాలు పాడుచేసేవాడు. రాత వాడికి అబ్బలేదు. తన్నుతాను తిట్టుకొనేవాడు. అంతే...ఇలాంటి

రోజుల్లోనే సాగరానికి డబ్బు వచ్చి పడింది.

* * *

ఒకసాయంత్రం గోదావరి ఒడ్డున కూర్చున్న సాగరానికి ఒక ఆలోచన వచ్చింది. డబ్బునిబట్టి ఆలోచనలు వస్తాయి కాబోలు అనుకున్నాడు.

తాను చెప్పుకుపోతూంటే రాసిపెట్టే వారెవరైనా ఉంటే ఎంతబాగుండును!! ఇదీ సాగరానికొచ్చిన ఆలోచన. ఈ ఆలోచన ఇప్పుడు మొలకెత్తడానికి ఎప్పుడో, ఏదో మూల బీజంపడి ఉంటుందనిపించింది. పెద్ద గోడలమీద డాబాలమీద మర్రి, రావిలాంటి మొక్కలేవేవో మొలుస్తుంటాయి. వాటి విత్తు అక్కడ పడటానికి ఏ పిట్టో, కాకో, గాలో ఏదో ఒకటి అయి ఉంటుంది. ఈ ఆలోచన ఎలా వచ్చిందా అని గింజుకుంటే తెలీదు, దానంతటదే ఎపుడో తెలుస్తుంది.

ఇంతకూ తన వాగుడు విని ఎవరు రాస్తారు?

ఏ ఒక్కరైనా ఉండకపోతారా?

ఎవరు రాస్తే బాగుంటుంది?

అసలు ఎవరు రాయగలరు!......

. . ఈ రోజుల్లో ఆడవారు రాసినట్టుగా మొగవాళ్ళు రాయలేరేమో...ఒపిగ్గా రాయాలన్నా అందరికీ చదవడానికి యిష్టంగా ఉండాలన్నా, సంక్రాంతికి వీధి వీదంతా నింపే చుక్కల ముగ్గు పెట్టి యింకా నేల మిగిలితే ఎంత బాగుండును అని చూసేట్టుగా (రంగు రంగు దారాలతో ఎంబ్రాయిడరీచేసి జరీ బుటాలు కుట్టినట్లుగా, పసుపురాసి బొట్లుపెట్టి ద్వారాన్ని కళకళలాడించినట్టుగా, నలుసంత పిల్లల్ని పెంచి పెద్దాళ్లను చేసినట్టూ వాళ్ళే రాయగలరు. కూర్పు ఓర్పూ, పెంపు సొంపూ వాళ్ళ సొత్తు. ........

రావిచెట్టుక్రింద బుద్ధుడికి జ్ఞానోదయ మైనట్లుగా గోదావరి చల్లటిగాలిలో సాగరానికి మంచి ఊహతట్టింది. ఖులాయిగా డబ్బు తగలేసేకంటే దురాశ పెంచుకునేకంటే వెడ్డదనిపించని మార్గంలో పెట్టడమే సద్వినియోగం అనిపించింది. ప్రోత్సహిస్తూపోతూన్నట్లు గోదావరి సంజతళతళలతో ప్రవహిస్తోంది.

* * *

సాగరం స్నేహితుడొకడు ఒక ప్రాంతీయ వారపత్రికను కూలీడింకు బండిలాగ తోసుకుంటూ నడుపుతున్నాడు. వేలంనోటీసులు కోర్టు ప్రకటనలు, పొగడ్తలకి అన్నపూర్ణ హస్తాన్ని బైటికి తీసే వారి సఫోటో చరిత్రలు( చిన్న చిన్న దుకాణదార్ల అడ్వర్టయిజుమెంట్లూ పత్రిక ముఖ్యాధారాలు

సాగరం సంకల్పం నెరవేరడానికి దూరంనించి ఎవరూరారు డబ్బు అవసరం అంతగా లేనివాళ్ళు కూడా రారు. ఇంతో అంతో రాత గత్తెలమని అను




కుంటున్న వాళ్ళూరారు. ఇలాంటివన్నీ ఆలోచించి ప్రకటన ఎలా ఉండాలో తనకు తోచినట్టుగా చెప్పిందే తడువుగా ఆ మిత్రుడు పెద్ద అక్షరాలతో పువ్వుల బోర్డరు కట్టించి అచ్చు కూర్పించాడు.

* * *

అవ్వ తనకున్నదంతా ఊళ్ళోని వేణుగోపాలస్వామికి రాసేయటానికి సిద్ధపడుతున్న సమయంలో మనవడు, కూతురుకొడుకు; తాతకూ తనకూ ఉత్తరగతులు చాపించేవాడు, అడ్డాల్లోవేసి ఆడించినవాణ్ణి నాటికి నేడు చూసి వేణుగోపాలస్వామి గుడివేపు తిరిగి ఒక్క దండంపెట్టి ఊరుకొంది.

* * *

సాగరం బాల్యక్రీడలన్నీ నాగావళి నది ఒడ్డున, పావంచాల మీది గట్టుదూకి నీట్లో ఈతకొడుతూ, కార్తీక సోమవారాలొస్తే రావి చెట్టు పీనెమీదకూర్చొని లేత లేత కొబ్బరి గుజ్జు తింటూ కోటీశ్వరాలయం పెద్ద గంట ఝుంకారం నేపథ్య సంగీతంగా సాగాయి. స్కూల్లో చదవక ముందునుంచీ ఆంజనేయస్వామి కోవెల్లో ఇత్తడి గుర్రం వాహనం ఎక్కీ, ఏనుగు వాహనం మెళ్ళోగంట ఆడించీ, రోజూ ఆడుకోడం. తర్వాత అక్కడే కాపీలు రాస్తుండడం హోంవర్కు చేయడం, చేతి కొచ్చినట్లు తోకమాత్రం చాలా బ్రహ్మాండంగా హనుమంతుడి బొమ్మలువేయడం ఇలాగడిచింది. అంచేతేనాగావళి, శారద, గోదావరి నదులంటే సాగరానికి చెడ్డమమకారం. నదులు ఒక్కొక్కళ్ళు బురదే, కాని

సాగరానికి రూపుదాల్చిన దేవీ మూర్తి ల్లాగ కనిపిస్తూంటారు తలపు కొచ్చినప్పుడల్లా...సాగరానికి వయసు వస్తున్నప్పట్నించి పాతికేళ్ళవరకు నడిచినకాలం పీడకలలాంటిది. అది జ్ఞాపకం రాకుండా ఉండటానికే ప్రయత్నిస్తూంటాడు. తల్లీ దండ్రీపోయాక అవ్వదగ్గిర కే పోదామని బయలుదేరి ఊళ్ళు పట్టి పోయాడు.

మళ్లీ ఇన్నాళ్ళకి అవ్వ ఇంటికి చేరుకొని ఏంచేసినా కాదననీ, ఎంత ఖర్చు చేస్తున్నా వొద్దన్ననీ హామీ యిచ్చిన మీదట, 'నందనం' తగిలించాడు.

* * *

తన ప్రకటన వచ్చాక నాలిక్కరుచుకున్నాడు.

పిచ్చి ప్రకటన చూసి ఎవరు వస్తారు? ...రాకపోతే పోన్లే...అని ఊరుకొని మళ్లీ—వస్తే ఏ మధ్యవయస్కురాలో వస్తుంది–అనుకున్నాడేగాని గోదావరమ్మ అనే...కాదు గోదావరి అనే ఇరవై లోపు చిన్నది వచ్చిపడుతుందని అనుకోలేదు. లాటరీ వస్తుందనుకున్నాడా? అనుకోలేదు, రావాలనీ కోరలేదు. వీపుమీద గుద్దింది!

అదృష్టం కొందరి వీపుమీద గుద్దుతుంది. కొందరికి నెత్తిమీద పడుతుంది కాకి రెట్టలాగ. కొందరికి పాతాళంనుంచి గంగ చిమ్ముకొచ్చినట్లు పాదాలకు గుచ్చుకొని మరికదల్నీదు. కొందరికి ఎదురుగా ఢీ కొడుతుంది!

ఆమెమాత్రం ఎదురుగా వచ్చినట్టనిపించుతోంది సాగరానికి....", చెప్పుకుపోతూన్న సాగరానికి ఆమె ఉలిక్కిపడ్డట్టు చూడ్డం అతను గమనించలేదు, "ఇక్కడ్నించి అసలు కథ ప్రారంభం అవుతుంది, 'అసలు కథ' అని మకుటం రాయండి!" అంటూ ఆపి అటు చూశాడు. గోదావరి తలదించేసుకుని అదోలా యిదవుతూన్నట్లు కనిపించింది.

"క్షమించండి, మీరేదో నొచ్చుకుంటున్నట్టుంది, నేను మొదటే చెప్పానుగా, నా నోటికి ఎలాగ వస్తే అలా......"

"చెప్పండి... 'అసలు కథ'?" అంటూ గోదావరి ముఖం ఎత్తింది, అతని ముఖాన్ని పరీక్షగా చూస్తూ.

"లేదు-ఇహ చెప్పేది లేదు, ఇప్పుడు మరేం చెప్పలేను, ఇప్పటికిది 'సశేషం'. అసలుకథ రేపు చెప్తాను," అంటూ సాగరం లేచి వీధిలోకెళ్లి,... ఏయ్ రిక్షా! ఇలారా...అంటూ కేకవేస్తున్నాడు. గోదావరి ముఖం కలక తీరినట్టుంది.

రిక్షా గోదావరి కోసమే...

(సశేషం)

# తాను తవ్విన గొయ్యి



గుత్తుల భాస్కరరావు

గతరాత్రి బంగాళాఖాతంలో వాయుగుండమని రేడియో ప్రకటించినపుడు లలిత ముందుచూపుతో శనగలు నానబోసింది. అవే మషాలాశనగలై ఈ పూటకి టిఫిన్‌గా అవతరించినై. ఒక్కొక్కటి తమాషాగా దంతాల మధ్య నలగేస్తున్న సమయంలో యాభై ఏళ్ళ యింటావిడ సీతారత్నం గారు తలుపులు తోసుకొని తెల్లటి బట్టలతో వచ్చింది.

చటుక్కున చాకచక్యంగా బల్ల చాటుకి శనగల ప్లేటు తోసాను. అంగిట్లో మిగిలిన అవశేషాన్ని రహస్యంగా మింగి 'రండి రండి' అన్నాను లేచి నిలబడి. ఆవిడ నవ్వుతూ 'కూర్చోబాబూ' అంటూ కుర్చీ లాక్కుంది.

నేనంటే ఆవిడకి చాలా మంచి అభిప్రాయం ఉండడం మూలాన యింత వరకూ అద్దెకున్న వాళ్ళలో నాలాంటి వాణ్ణి ఆవిడ చూడకపోవడం వలన... ఆమె మెచ్చుకోలుకు అనుగుణంగా నడుచుకుంటూ వచ్చాను. అందుకే నిలబడి ఉంటూనే 'ఫరవాలేదు చెప్పండి' అన్నాను. 'కూర్చో నాయనా ... ఒక విషయం మాట్లాడాలి' అని ఆవిడ గద్దించడంతో ఎదురుగా కుర్చీలో ఒదిగి కూర్చున్నాను.

"చూడుబాబూ మూర్తీ! మనకు డబ్బు ప్రధానం కాదు. లంకంత కొంపలో ఉండలేక ... మధ్యలో మేం ఉంటూ రెండు వాటాలు అద్దెకిచ్చాం...అయినా ...యిలా యిల్లు వాడుకోడం తెలియని ఏబ్రాసులకి యివ్వాల్సి వస్తుందనుకోలేదు" అంది సీతారత్నంగారు.

విషయం ఏ వాటావాళ్ళమీదో అర్థంకాక లలిత సాయంకోసం వంటింట్లోకి చూసాను. ఏ మూలో కుంపటి కౌగిట్లో ఉన్నట్టుంది. కంటికి కనిపించలెదు. ఆవిడ నవ్వి "అబ్బ! మీవిషయం కాదు బాబూ. మీకేం మల్లెపువ్వుల్లా చూడముచ్చటైన దంపతులు. ఆ గోపాలం విషయం నేచెప్పవచ్చేది. మా కొంప పీకి పందిరెయ్యడానిక్కాక పోతే... ఆ పిల్లలు వాళ్ళని ఉద్ధరించడానికా? పందెంపుంజులా మాతో పూటపూటకీ గిల్లికజ్జాలు పెట్టుకోకపోతే ఆవిడ ఉంది కాపరం చెయ్యడానికా? రామ రామ వేగలేకపోతున్నాం ఆ మూకతో. యిల్లేనాడైన కడిగిన పాపాన పోయిందా? కళ్ళారా చూద్దామంటే ఒక్కరోజైనా వాకిట్లో కళ్ళాపిజల్లి ముగ్గు పెట్టిందా? బండెడు అంట్లు తోముతుందే ఒక్కనాడైనా నూతిపళ్ళెం కడిగిందా? బాబూ అవన్నీ ఎందుకు. యిలాంటి మందని యింట్లోంచి వెళ్ళగొట్టడమే నా ఉద్దేశ్యం అందుకని అద్దె యాభైనుండి అరవైకి పెంచుతున్నట్టు నాటకమాడుతున్నాను. వాళ్ళెలాగూ అరవై యిచ్చుకోలేరు. యిల్లు ఖాళీ చెయ్యడం ఖాయం. యిందుకు నీ మాట సాయంకావాలి బాబూ" అంది గుక్కతిప్పుకోకుండా.

"మాట సాయమా" అన్నాను ఉత్సాహంగా... నాకు గోపాలం మీదఉన్న పాతకోపం పురస్కరించుకొని. చేప పిల్లలా ఎగిరిన నా ఉత్సాహాన్ని అంది పుచ్చుకొని "అవును బాబూ నువ్వు అద్దె అరవై యిచ్చినట్టు గోపాలంతో అబద్ధమాడాలి. అదీ అవసరమైతేనే... సాధ్యమైనంత వరకూ నేనే వెళ్ళగొడతాను" అంది. ఎప్పట్నుంచో గోపాలానికి దూరంగా ఉండాలన్న నా కోరిక యిలా నెరవేర బోతుందని ఊహించలేదు.

"సరే" అన్నాను పూతంగా. ఆవిడ హాయిగా విశ్వసించి పరమానందంగా వెళ్ళిపోయింది.

లలిత ముందు గదిలోకి దూకుడుగా

వచ్చి "అంతా విన్నాను. అయితే ఆవిడ చెప్పినట్లు చేస్తారన్న మాట" అంది కోపంగా అవునన్నట్లు చూసి దాచుకొన్న శనగల ప్లేటు ముందుకి లాక్కొని "ఏం" అన్నాను.

"యివాళ వాళ్ళని లేవగొడుతుంది. రేపు మనల్ని. గుర్తుంచుకోండి" అని గొణుక్కుంటూ వంటింట్లోకి వెళ్ళి పోయింది.

అదేమీ కాదు. గోపాలం అంటే నాకెంత అసహ్యమో లలితకు అంత అభిమానం. అతనూ నేనూ ఒకే ఆఫీసులో క్లర్కులం. అతన్ని లలిత బ్రతుకనేర్చినవాడని మెచ్చుకుంటుంది. నన్ను చేతగాని వాడికింద జమకడుతుంది. ''ఆఫీసులో బల్లకిందకొద్దో గొప్పో పండిస్తున్నాడు గాబట్టి సరి పోయింది. మనలాంటి 'గోచీకి ఎక్కువ గావంచాకి తక్కువ' జీతగాళ్ళకి జీతాలేమూల" అంటుంది

'మీవారు ముట్టుకొరుగాని ఆసీట్లో బంగారం దొరుకుతుంది' అని గోపాలం భార్యద్వారా విన్న లలిత పోరు పరింతలైంది.

'ఏమిటీ పాడు రిపోర్టు. అటు మేతా లేదు. యిటు రాతారేదు' అని నావల్ల పని జరగని మంటతో ఆఫీసరిచ్చిన డోసు ఆమెవల్లే లలిత చెవులోకి పాకింది. ఇదంతా గోపాలం ప్రతిభ.

ఒక పూట ఉండలేక "అయితే అతనిలా గడ్డి తినమంటావా" అని నిలేసాను లలితని.

"మనకూ నలుగురు బైలుదేరిం తర్వాత తెలుస్తుంది. అది గడ్డో గాదమో." యిల్లాలి ఎదురు పోటు.

"గోపాలం దరిద్రం కొన్ని జన్మలెత్తినా తీరదు లంచాలు పుచ్చుకుంటున్నా నెలకి వందపైన అప్పులు చేస్తాడు. యిదిలా ఉంటే ఓ శుభ ముహూర్తాన పెళ్ళాంబిడ్డల్ని నట్టేట్లో ముంచి జైలుకిపోతాడు" బెదిరించాను.

"జైలు పడేది తెలివి తక్కువ వాళ్ళకి. పార్టీలని పీడించుకు తినక్కర్లేదు. యిచ్చిన వాళ్ళ దగ్గర పుచ్చుకుంటే నంటద్దె పోతుంది. బాబూ మీరు నిజాయితీగా బ్రతుకుతానంటే కాదనను. నా ఖర్మ అనుకుంటాను," అంది ఆ రోజుకి ముగిస్తూ.

ఈ గోపాలం వల్ల యింట్లో సుఖ శాంతులు లేకపోయాయి. పట్టుమని పాతికేళ్ళు నిండని ఈ ఆడకూతుర్ని ఎక్కడలేని దురాశ ఊపిరాడకుండా చేస్తుంది. నా జీతం మా యిద్దరికీ సరిపోని మాట వాస్తవమే. ఆదాయంలో అయిదో వంతు అద్దెకింద హారీ అనడం నిజం ఈ పట్టణంలో నాలాంటి లోయర్ మిడిల్ క్లాస్ మనిషి బ్రతకడానికి యాభై కి తక్కువ వాటా యించుమించు లేదు. తప్పని సరిగా పెద్ద మొత్తమైన యాభైని అద్దెకి జమకట్టడం తద్వారా

ఎన్నో సరదాల్ని చంపుకొని కుదింపు బ్రతుక్కి అలవాటుపడ్డం లలితకి విసుగ్గానే ఉంది. సీతారత్నంగారి పుణ్యమా అంటూ గోపాలం యిల్లు ఖాళీ చేస్తాడు. ఆపైన ఈ సమస్య లలితని అంతగా బాధించదని నా నమ్మకం.

ఫస్టు తారీఖు సాయంత్రం ఆఫీసు నుండి యింటికి జేరుకొని అలసటగా పడక్కుర్చీలో నడుంవాల్చాను. బయ లేదో రగడ జరుగుతూంది. సీతారత్నం గారితో గోపాలం వాగ్వివాదం కర్ణా కర్ణిగా వినబడుతుంటే లేచి గుమ్మం వరకూ వెళ్ళి మూసిన తలుపులకాని చెవులు రిక్కించాను.

ఆవిడ కంఠం పెద్ద స్థాయిలో ఖంగునవినిపిస్తూంది. "న్యాయం లేదు అన్యాయం లేదు. అరవై రూపాయలు యిచ్చుకో లేకపోతే యిల్లు ఖాళీ చెయ్యా ల్సిందే."

గోపాలం "ఎంత తేలిగ్గా అన్నారు యిల్లు ఖాళీచెయ్యమని. మీ రే సదుపా యాలు చేసారని అర్థాంతరంగా అద్దె పెంచారు ?" అన్నాడు.

"అదంతా అనవసరం. మీరున్నా సరే ఖాళీచేసినాసరే అరవైకి అరపైసా తగ్గను."

"సరే యాభైకిమించి ఒక్క చిల్లి గవ్వ యివ్వను. యిది కాకపోతే దీని బాబులాంటి పోర్షన్ చూస్తా. తక్షణం ఖాళీచేస్తాను" అని గోపాలం చివాల్న యింట్లోకి వెళ్ళాడు ... తలుపుసందు లోంచిచూస్తూ మా బాగా జరిగింది అను కున్నాను. సీతారత్నంగారు ఊరుకో కుండా మరోపుల్ల వెలిగించింది.

"మీ వాటాకో రూలు ఆ వాటాకో రూలూనా? మాకు అందరూ సమానమే."

గోపాలం సర్రున బైటకి వచ్చాడు. "అంటే మూర్తి అరవై యివ్వడానికి ఒప్పుకున్నాడా ?" అన్నాడు ఉద్వే గంతో. నా గుండె కొట్టుకుంటూంది. యిప్పుడు నా పాత్రకి పని కలుగ బోతూంది.

"ఒప్పుకున్నాడా ఏమిటి ? చెక్క పేళ్ళలా అరవై రూపాయలిస్తే." బలే కోసింది నేనింకా అద్దె యివ్వనే లేదు.

"మూర్తి అంతపని జేసాడన్నమాట" గోపాలం ఆశ్చర్యం. మళ్ళీ "ఏదీ పిల వండి-నేనడుగుతాను" అన్నాడు.

"నే న బ ద్ధం చె ప్పా నా ? ... మూర్తీ ... " అని కేకేసింది అధికార యుక్తంగా.

రోషపడి మడుగునుండి బైటపడ్డ దుర్యోధనుడిలా వెలుపలికి వచ్చాను.

"అవునయ్యా యిచ్చాను" అన్నాను ధీమాగా.

"ఛీ, ఎంత తెలివి తక్కువ వాడి వయ్యా నువ్వు – వాళ్ళు ఎంత పెంచితే అంత యిచ్చెయ్యడమా. ఒక ఆఫీసులో

యువ

పనిజేస్తున్నాం. నాతో మాటవరసకైనా సంప్రదించావా ?" అన్నాడు బిగ్గరగా.

సీతారత్నంగారు గుమ్మానికి ఠీవిగా జేరగిలబడి నిల్చుంది, నా ధోరణిమీద కొండంత ఆశను పెట్టుకొని.

"ఏమని సంప్రదించాలి బోడి పది రూపాయలకి. అంత విలువచేస్తుంది గాబట్టి చెల్లించాను. మనమూ వాళ్ళ యిబ్బందులు తెలుసుకోవాలి" అంటూ శక్తివంచనలేకుండా వాదించాను. "అది నీకు బోడి పదిరూపాయలు – నాలాంటి వాడికి అదే పదివేలు. దీనివల్ల నేను చెడి పోయింది లేదు. యిల్లు ఖాళీచేస్తాను. అంతే. నువ్వుమాత్రం వాస్తవాన్ని తెలుసుకొని ఒళ్ళు సిలదొక్కుకో" అని హెచ్చరించి యింట్లోకిదూసుకుపోయాడు గోపాలం.

నేనూ సీతారత్నంగారు పాచిక పారిందన్న సంతోషంలో నవ్వు చూపు లతో ఛీర్స్ కొట్టుకుంటూ నిష్క్రమించాం.

మర్నాడుదయం పేపరు తిరగే స్తుంటే సీతారత్నంగారు వచ్చి "చాలా సంతోషం బాబూ. నీ మాట సాయం పనిచేసింది" అంది కూర్చుంటూ.

నేను విజయగర్వంతో "యివాళ ఖాళీచేస్తున్నాడా యిల్లు" అన్నాను.

''లేదుబాబూ, ఏం ఆలోచించు కొన్నాడో ఏమో 'ఆ మూర్తికంటే తీసి పోయానా' అంటూ 'అరవై యిస్తాన'ని ఒప్పుకొన్నాడు. మన డబ్బులు మన కొస్తున్నప్పుడు... ఎవరైతేనేం నాయనా ఏమంటావు."

నాకు కళ్ళమీద మబ్బుల గుంపు చుటుముట్టినట్టయింది. కాళ్ళకింద గచ్చు విచ్చుకుంటున్నట్టయింది. గోపాలం వెళ్ళకపోవడం దేవుడెరుగు ... అద్దె అరవైలో ఫిక్స్ అయినందుకు యిరు కులో పడ్డాను.

"అన్నట్టు చూడు బాబూ. నీకు చెప్ప నక్ఖర్లేదు. మన వాటా అద్దెకూడా అరవై రూపాయలే. లలితకి చెప్పు. ఈనెల పెంకుతిరగే యిస్తున్నా. స్నానాలగది తలుపుబాగుచేయిస్తా...యింక..."

ఆవిడ అలా ఎంతసేపు మాట్లా డిందో... ఎప్పుడు వెళ్ళిపోయిందో నాకు గుర్తులేదు.

ఆ రోజు కారోజు కిక్కురుమనకుండా యిల్లు ఖాళీచేసాను అరవై రూపాయ లిచ్చుకోలేని అభాగ్యుణ్నయిన నేను.



# నేరం లేని శిక్ష!

కల్యాణి తేజ

రాత్రి తొమ్మిదైంది.

భోజనం ముందు కూర్చున్న భుజంగరావు మొహం చిట్లించాడు మోటుగా.

డైనింగ్ టేబుల్ పక్కన నిలబడ్డ సుభద్ర మూతి మూడు వంకర్లు తిప్పింది.

"ఏం కూర ?" అన్నాడు భుజంగరావు దూకుడుగా.

"కనబడ్డంలా ? - సొరకాయ పాలు పోసి వండిన కూర" అన్నది సుభద్ర దురుసుగా.

"నిన్నగాక మొన్న సొరకాయ వేపుడు ; నిన్న పొద్దున సొరకాయ పులుసు ; నిన్న రాత్రి సొరకాయ పచ్చడి ; ఇవాళ పొద్దున సొరకాయ కూర్మా... ఈ పూట ఇదీ ! ఇదేమైన సొరకాయ వారమా ?" అన్నాడు భుజంగరావు విసుగ్గా.

"ఇది బాగానే ఉందండోయ్ ! నన్నేం చేయమంటారు ? నేనేమైనా రూపాయలు గుమ్మరించి సొరకాయ గంప కొన్నానా ? ధరలు సీమటపాకాయలా మండే ఈ కాలంలో ఎవరో పుణ్యాత్ములు దానధర్మంగా ఇచ్చిన కూరగాయలను ఒక్కటికి పదిసార్లు తినడానికి అట్లాగుసుస్తారేమిటి ? అన్నది సుభద్ర అర్ధగజం దీర్ఘందీస్తూ.

"సొరకాయలు దానం చేసే ఆ పుణ్యాత్ముడెవరే !"

"ఈ వీధి చివర నాయుడుగారు లేరూ !... ఆయన ! దొడ్లో విపరీతంగా కాస్తున్నాయట. ఈ వారంలో రెండు కాయలు పంపించారు - గుమ్మడి కాయంతవి. మార్కెట్‌లో కొనాలంటే ఒక్కొక్కటి రూపాయిన్నరకు తక్కువ రాదు. ఏమనుకొంటున్నారో ఏమో !"

భుజంగరావు మళ్లీ నోరుఎత్తకుండా భోజనంచేశాడు. ఆ తర్వాత నాయుడి గారింటికి కోపంగా ఫోనుచేశాడు.

"హల్లో !... నాయుడుగారా !... నమస్కారం !... ఆఁ !...అవునండీ ! ఇప్పుడే అయింది భోజనం - మీ సొరకాయ కూరతో ? అది సరేగాని, రోజూ సొరకాయ కూర తినలేక చస్తున్నాను. ఒక వారం రోజుల పాటు సొరకాయలు పంపడం మానేయకూడదూ ?"

అవతలనుంచి జవాబు :

"చంపేశారు బాబూ ! మీ బోటి వాళ్లకు సొరకాయలు పంపకపోతే, మా ఆవిడ ముప్పొద్దులా సొరకాయ కూరే మా మొహాన కొడుతూంది స్వామీ ! ఆ బాధనుంచి తప్పించుకోవడానికే ఈ ఏర్పాటు చేశాను. మీరు క్షమించాలి మరి.

భుజంగరావు గబుక్కున ఫోను కింద పెట్టేశాడు.

---




అవధాని బి.ఎ ప్యాసయిన తర్వాత బి.ఇడి. కూడా అయిందనిపించుకున్నాడు. అటుతర్వాత బడిపంతులు ఉద్యోగంకోసం దరకాస్తులు పెట్టి ఉంచాడు. ఈ రోజుల్లో ఉద్యోగాలంత తేలికగా దొరుకుతాయా ? అందుకని ఎవరో చెప్పారని ఓ మంచిరోజు చూసి ఇంటిముందు బోర్డు కట్టేశాడు. దాని సారాంశమిది.

అవధానీ ట్యుటోరియల్ ఇంగ్లీషు ఇచ్చట హెచ్.ఎస్.సి. ఎస్ ఎస్.సి; మెట్రిక్ (జూ అండ్ సీ) మొదలుకొని ఆరవతరగతి వరకు ప్రయివేట్లు చెప్పబడును.

ఆ బోర్డు కట్టిన మూడోరోజుకి ఓ పెద్ద మనిషికి ఓ కుర్చీ చూపించి అతడు కూర్చున్న తరువాత ఆయనరాకకి కారణం అడిగేడు ఆ వచ్చిన పెద్ద మనిషి తాను వచ్చిన పని బయట పెట్టాడు. వాళ్లబ్బాయి ఏదో తరగతి రెండుసార్లు తప్పాడట. ఏ మాష్టరు దగ్గర ప్రయివేటు చెప్పించినా లాభం వుండటం లేదట. అందుకని ఇక్కడకు వచ్చానని చెప్పాడు

ఇది మొదటి కేసు గనుక పోనివ్వకూడదని అవధాని ఆ కుర్రవాణ్ణి పరీక్ష ప్యాసు చేయించే బరువు బాధ్యతల్ని విశాలమైన తన భుజస్కంధాలమీద వేసుకున్నాడు. ఫీజుకూడా అందరికంటె అయిదు రూపాయిలు తక్కువ. ఇహనేం అన్నీ చక్కగా కుదిరిపోయాయి. ఆ మర్నాడే ఆ కుర్రాడు ప్రయివేటు కొచ్చాడు. అప్పుడుగాని తెలియలా ఆ కుర్రాడికి రెండో ఎక్కం కూడా రాదనీ, వొట్టి మొద్దనీ; వందసార్లు చెప్పిన ఒక్కసారైనా కరెక్టుగా లెక్క

చెయ్యలేక పోయే సరికి 'అబ్బా ! ఇదెక్కడి కర్మరా బాబూ' అంటూ తల పట్టుక్కూచున్నాడు అవధాని తెలుగు, ఇంగ్లీషు డిక్టేషను అన్నీ తప్పులే. కాని ఏంచెయ్యగలడు వాణ్ణి ? పైగా వాణ్ణి పరీక్ష చేయించే బాధ్యత తన విశాల భుజస్కంధాలమీద వేసుకున్నాడాయె !

చైనాలో సాంస్కృతిక విప్లవం ప్రవేశ పెట్టినట్టుగా ఆ కుర్రాడిలో విద్యా విప్లవాన్ని తీసికురావాలని అవధాని నిశ్చయించుకున్నాడు. పునాదులు గట్టిగా వుంటేనే ఏ కట్టడమైనా నిలుస్తుందని ఆ ఏడో తరగతి కుర్రాడికి ఎక్కాల పుస్తకం వొకటి, ఒకటో తరగతి తెలుగు వాచకం, ఎలిమెంటరీ ఇంగ్లీషు పుస్తకం రాసిచ్చి అవి కొనుక్కోని ఆ మర్నాడు పట్టమ్మన్నాడు. ఆ కుర్రాడు బుఱ్ఱాడించి ఆ మర్నాడు వాడి తండ్రిని వెంటేసుకొచ్చాడు. ఏమిటి 'మేష్టారూ ?' మావాడికి ఒకటో తరగతి పుస్తకాలు రాసిచ్చారు ?

మరేనండి. మీ వాడికి అసలు ఏమీ రాదు. అందుకని పునాదులు...అదే స్టాండర్డు, గట్టిగాఉంటుందని ఒకటో తరగతినుంచి మొదలుపెడుతున్నాను.

'అయితే ఒకటో తరగతి తర్వాత రెండో తరగతి, ఆ తర్వాత మూడో తరగతి పుస్తకాలు కొనాల్సిందేనా ?'

'ఆహాఁ'

'అయితే మీకూ, మీ ప్రయివేటుకీ ఓ నమస్కారం ! 'వెళ్తున్నాం' అంటూ వాళ్లబ్బాయిని వెంటబెట్టుకుని వెళ్లిపోయాడా పెద్దమనిషి. అవధాని అలా చూస్తూ వుండిపోయాడు. ఆ విధంగా శిష్యుడూ, నెంబర్ వన్ అండ్ లాస్ట్ ఆ రెండో రోజునే జారుకున్నాడు. అటు తర్వాత అవధాని దగ్గరకు ప్రయివేట్లు చెప్పించుకోడానికెవ్వరూ రాలేదు.

నెలరోజులు గడిచిన తర్వాత ఓ మిట్టమధ్యాహ్నంవేళ మున్సిపల్ టాక్స్ కలెక్టర్ వచ్చాడు. 'అవధాన్లు గారు మీరేకదూ !' అన్నాడు.

'అవునండి. నేనే ! ఏం కావాలి మీకు ?'

'బైట గోడకు కట్టిన బోర్డు మీదే కదూ ?'

'ఆఁ, అవును.'

'అయితే మీరు టాక్స్ కట్టాలి ?

'టాక్సా ! ఎందుకు ?'

'ఎందుకేమిటండీ ! అలా బోర్డు కట్టినందుకు,' అంటూ బిల్లుపుస్తకాలు తీశాడు టి. సి.

'ఎంటే ?' - అన్నాడు అర్థంగాక అవధాని.

'ఎడ్వర్టైజ్‌మెంట్ టాక్స్ అండీ !' అన్నాడు, టి.సి. రశీదుచింపుతూ

అవధాని నోరు వెళ్లబెట్టాడు.

పోకెట్ మనీగా ఉంచుకున్న డబ్బుని టి సి. చేతుల్లో పెట్టి టి సి. అందించిన రశీదు పుచ్చుకున్నాడు అవధాని. అతని కాసమయంలో ఏడుపు వచ్చేలా ఉంది. అయినా తమాయించుకున్నాడు.

టి.సి. అతన్ని అదోరకంగా చూసుకుంటూ వెళ్లిపోయాడు. అతనటు వెళ్లిపోగానే 'ఇచ్చట ప్రయివేట్లు చెప్పబడును' అన్న బోర్డు పీకి అటకమీదకు విసిరి పారేశాడు అవధాని.

---



# సొల్యూషన్

ఎ.వి.సీతారామమూర్తి

సాయంత్రం యిల్లుజేరిన రాజారావుకి గుమ్మంలో సరళ కన్పించకపోగానే ఆశ్చర్యమేసింది – ఆశ్చర్యంతో పాటు అనుమానం కూడ వచ్చింది – రోజూ అయితే ఆ వేళకు తలుపులు తీసుకుని భర్త గురించి ఎదురు చూసేది సరళ– రాజారావు వచ్చాకనే కాఫీలు కలిపేది – అంతవరకూ ఆమె కూడ తాగేదికాదు.

తలుపుతట్టిన పది నిముషాల తర్వాత వచ్చి గడియతీసి వెళ్ళిపోయింది సరళ – ఈ మాటు రాజారావ్‌కి తన అనుమానం నిజమేమోనన్న నమ్మకం కలిగింది.

సరళ ఎంచేతనో అలిగింది-లేకుంటే ఎందుకలా ముఖం చాటేసుకు తిరుగుతుంది? కాఫీ యివ్వకపోతేపోయె కనీసం మాట్లాడ్డానికేం?

ఆఫీసులో కష్టపడి యింటికి వచ్చిన మగాడిని విసిగించకూడదన్నైనా వుండదు కాబోలు యీ ఆడవాళ్లకి.

రాజారావు తన మనసులో రగులుతున్న ఆలోచనలను అక్కడితో ఆపాడు-ఆడదానిక అందులో శ్రీమతికి అలకొచ్చినా కోపమొచ్చినా మగాడికి ఎటువంటి ఆలోచనలు పనికిరావు. ఆమె కోపానికి తట్టుకోవాలి. యేమన్నా పడాలి-చిరునవ్వుతోనే జవాబు చెప్పాలి-ప్రేమతో లాలించాలి-లేకపోతే ఆనాటి నుంచి నాలుగు రోజుల వరకూ పిల్లి పొయ్యిలోనూ, తాము విడివిడిగానూ పడుకోటం తప్పదు!

ఈజీ చైర్‌లో కూర్చుని ఆలోచిస్తున్న రాజారావుకు ఎదురుగా కాఫీకప్పుతో నిలిచిన సరళని చూస్తే ఆశ్చర్యమేసింది. కాఫీ కప్పు అందుకుంటూ ఆమె ముఖంలోకి చూశాడు. గాఢ నిద్రపోయి లేచిన తర్వాత వుండే కళ్ళలా ఆమె కళ్ళు వుబ్బి వున్నాయి-తెల్లటి ఆ బుగ్గల మీద చారలు స్పష్టంగా కన్పించాయి.

కాఫీ కప్పును క్రింద పెట్టి మృదువుగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు రాజారావు.

"నన్నొదలండి-నా కవతల బండెడు చాకిరీ వుంది. మీతో సరసాలాడ్డానికి నా కెలా కుదుర్తుంది" అంటూ తప్పించుకుని వెళ్ళిపోయింది సరళ-ఆమె కంఠంలో మునుపున్న సరళత కన్పించలేదు.

ఎంత ఆలోచించినా ఆమె కోపానికి కారణమేమిటో వూహించలేకపోయాడు రాజారావు.

స్నానంచేసివచ్చి వంటింట్లో ఆమె కెదురుగా పీట వాల్చుకు కూర్చున్నాడు. సరళ అదేం పట్టించుకోనట్లు తన పనిలో తాను నిమగ్నమై పోయింది

"మా సరళాదేవికి సినిమా చూపించి ఎన్నాళ్ళయిందో — వెళ్తే బాగుణ్ణు-" అన్నాడు ఆమెవైపు చూసి

సరళ వెనక్కుతిరిగి రాజారావు కళ్లలోకి ఎర్రగాచూసింది-ఆదే అదను చేసుకుని రాజారావు చిన్న నవ్వునవ్వి

"ఏం వెళ్దామా" అన్నాడు.

"నా కదొక్కటే తక్కువైంది - అయినా పెళ్ళాంకో చీరకొనాలనీ, సినిమా చూపించాలనీ, పువ్వులు తేవాలనీ ఒకరు చెబితేగాని తెలియని మీలో యింతమార్పు రావటం నా అదృష్టమే." అంది వెటకారంగా

రాజారావు వున్నపాళంగా లేచివెళ్ళి సరళ రెండు భుజాల్నీ తన చేతుల్లో బిగించి ఆమెను తన వైపుకు తిప్పుకున్నాడు.

"ఏమిటో చాల వేడిమీదున్నారు అమ్మాయిగారు! అన్నాడు."

"వయసులోని యీ వేడీ యీ కోరికలూ మీకు పనికిరావుగా – ఎంత సేపూ మీరు చెప్పినట్లు చెయ్యాలి. మీ మాటలు వింటూ మీ చేతిలో కీలుబొమ్మ అవ్వాలి. అప్పుడే మీకు సంతృప్తి" అంది– ఉక్రోషంగా.

గాలి తనమీదకు మళ్ళిందని తెలియగానే రాజారావుకి అసలు సంగతి అర్థమైంది. సరళ చిరకాల స్నేహితురాలు వనజ వచ్చి వుంటుంది – వచ్చింది వచ్చినట్లుండక వాళ్ళాయనగారికి జీతమెంత పెరిగిందో, తనకెన్ని చీ..యికొన్నారో, యింట్లో యేయే సామానులు కొన్నదో అన్నీ చెబుతుంది. ఆమెకదే పని. పైగా 'గేస్‌స్టవ్' 'కుక్కరూ' లేనిదే వంటేమిటమ్మా అంటుంది–మీరు విమ్ వాడరూ? అని ఆశ్చర్యపోతుంది. డబుల్‌కాట్ బెడ్ లేకుంటే నా కసలు నిద్రపట్టదు–' ఈ ధోరణిలో సాగుతుందామె సంభాషణ.

ఆ మధ్య వాళ్ళ చుట్టాల పెళ్ళికిసరళ వెళ్తే తీసుకొచ్చేందుకు తనువెళ్ళినప్పుడు విన్నా డామె మాటలు. కాకపోయినా మనిషి తత్వం తెల్సుకోవడమెంత సేపు?

'ఏయ్ సరళా–మనం దెబ్బలాడుకోడం మాటకేంగాని వెళ్దామా వద్దా చెప్పు–" అన్నాడు నెమ్మదిగా.

"నేనేం దెబ్బలాడాను ? అయినా నా మొహం ఎప్పుడూ మీ కళ్ళకలాగే కన్పిస్తుంది–నలుగురిలో కెళ్ళేటప్పుడు మంచి చీర కావాలనడం మీ దృష్టిలో తప్పు – అంతేగా ? అటువంటి కోరికలు నేనుకోరకూడదు. నెలకు మూడొందలు తెచ్చుకుంటున్న ..డిపెళ్ళాం ఎలా వుండాలో మీకు తెలియక పోయినా నాకు తెల్సు. నేనే భర్తను మీరేభార్య అయితే నేనెలా చూసేదాన్నో మీకు తెలిసేది."

ఈ మాటకు రాజారావుకి నవ్వాగలేదు.

సరళకి వుల్ వాయిల్ చీరమీదకంటె నైలెక్స్ చీరమీద, నైలెక్స్ చీరమీద కంటె కోలీసింథ్ చీరమీద మక్కువ ఎక్కువన్న సంగతి తనకుతెల్సు. జీతం మూడొందలన్నమాటేగాని చేతికొచ్చేది రెండొందలకు మించదు. ఇంటద్దెకు, బాకీలకూ పోగా పదోతారీకుక్కి పైసా మిగలదు. కాని ఆపాటిదానికే మూడొందలు తెచ్చుకొంటున్నామని గర్వపడ్డం రాజారావు కిష్టంవుండదు.

సరళమాత్రం హోదాగా వుండాలంటుంది–చీరలంటుంది–నగలంటుంది–స్టీలు గిన్నెలంటుంది–గేస్ పొయ్యి అంటుంది.

రాజారావు అన్నిటికీ సరే నంటూనే వాయిదాలు వేస్తాడు.

"నాకీసారి కోలీసింథ్ చీర కొంటేనే మీతో సిన్మాకి రావటం–అంత వరకూ రాను. నన్ను పిలవకండి–"అంటూ వెళ్ళిపోయింది సరళ.

లేచి పడకగదిలోకి వచ్చి రాజారావుకి వనజ వచ్చి వెళ్ళినట్లు నిర్ధారణ

అయింది. హార్లిక్స్ త్రాగిన ఎంగిలి కప్పులు అక్కడే వున్నాయి. తనకంటె గొప్పవారొస్తేనేగాని హార్లిక్స్ కలవదు సరళ - నీరసంగా వున్నా తను తాగదు ఒకరి దగ్గరైనా మనకు గౌరవం వుండక పోతే ఎలా అంటుంది.

వచ్చే జీతంతో శక్తికి మించిన పరుగులు పెట్టకూడదని ఎలా చెప్పాలో, ఆమెనెలా మార్చాలో ఎప్పటికీ అర్థం గాని సమస్యయింది రాజారావుకి.

ఆరోజుకిక ఎవ్వరూ మాట్లాడలేదు. రాజారావుకి భోజనంపెట్టి తను తినకుండానే లైటార్పి పడుకుంది సరళ - మనసులో వున్నా ఏమి అనలేక వూరుకున్నాడు రాజారావు.

భార్యాభర్తల మధ్య ఎన్ని భేదాభిప్రాయాలున్నా మళ్ళీ కలిసిపోవటం సహజం. వారం రోజుల్లో మళ్ళీ మామూలు మనుషులై పోయారు సరళా, రాజారావూ. కాని రాజారావు మనసులో ఆరాటం పోలేదు.

శనివారం వుదయం ఆఫీసుకు వెళ్తూ "అన్నట్టు సరళా నీకు చెప్పడమే మరచిపోయాను. నా చిన్ననాటి స్నేహితుడు గోపాల్ నిన్న కనిపించాడు. వుద్యోగం లేదట-అత్తవారి దీ వూరేనట. అయ్యో అనిపించినా యేం చేయగలం చెప్పు. వుద్యోగం లేకుండా పెళ్ళిచేసుకోవడమే తప్పు - మా యింటికోసారి రారా అన్నాను" రాజారావు మాట పూర్తి కాకుండానే.

"అయ్యో మీస్నేహం బంగారంగానూ, పోనీ ఆదివారం కదా భోజనానికైనా ఆ యిల్లాలితో రమ్మనలేకపొయ్యారూ?" అంది సరళ.

"అదేఅదే - ఆ మాటే అందామనుకున్నాను. కాని నువ్వేమంటావోనని..." నసిగాడు రాజారావు.

"నే నెప్పుడైనా మీ యిష్టానికడ్డొచ్చానా చెప్పండి - యిప్పుడైతేనేం పిలవండి" అంది.

ఎగిరి గంతేసి వెళ్ళిపోయాడు రాజారావు.

* * *

ఆ రోజే యిల్లు కడిగి గదులన్నీ శుభ్రంగా సర్దింది సరళ - అల్మారాలో సామానంతా నీటుగా అమర్చింది, ఫోటోలు తుడిచి యధాస్థానంలో వుంచింది. ముందు గదిలో టేబుల్ మీద కొత్తగుడ్డ వేసి కుర్చీలు చక్కగా అమర్చింది. వంటింట్లో డబ్బాలన్నీ సర్ది స్టౌవ్‌లు ఎత్తుగా పెట్టుకుంది - పినిపిల్లను పెందరాడే రమ్మని ఆర్డరు జారీచేసింది.

ఆ సాయంత్రం రాజారావుకు ఇంట్లో చాలా మార్పులు కనిపించాయి - యిద్దరొస్తున్నారంటే పదిమందికీ సరిపడ హడావుడి చేస్తుంది సరళ - వాళ్ళముందు తమ హోదా అంతస్తులను చూపాలనే ఆమె తాపత్రయం.



మారు మాట్లాడకుండా తనలో తనే నవ్వుకుని వూరుకున్నాడు రాజారావు.

*        *        *

"అబ్బబ్బబ్బ! యింకా నిద్రలేవ లేదూ?" అంటూ వచ్చిన సరళ కేకకు కళ్ళువిప్పి చూశాడు రాజారావు స్నానం చేసి మంచిచీర కట్టుకొని మల్లెపువ్వులా తయారైంది సరళ - లేచి దంతావధానం చేసుకునేసరికి టేబుల్ మీద కాఫీ, దానితో పాటు డైలీ పేపరు రెడీగా వున్నాయి.

స్నానం చేసి వస్తూ వంటింట్లోకి తొంగి చూసిన రాజారావుకి సరళ యిడ్లీప్లేట్లు క్రిందికి దించుతూ కన్పించింది.

'భారీయేర్పాట్లే!' అనుకున్నాడు మనసులో—

తొమ్మిది అయ్యేసరికి గోపాలం, అతని భార్య లత రానేవచ్చారు. ముందు గదిలో కాస్సేపు కూర్చుని పరిచయాలూ, మాటామంతీ అయ్యాక టిఫిన్ అందించింది సరళ-

"నాకిక్కడెందుకండీ-నేనూ లోపలి కొస్తా" అంది లత.

"మాయింట్లో అటువంటి మొహ

మాటాలేం లేవు అని సరళ అంటున్నా తన ప్లేటును పట్టుకుని లోపలికి వచ్చేసింది లత.

మగాళ్ళిద్దరూ ముందుగదిలో మాటల్లో పడ్డారు.

కాఫీ లయ్యాక లతకు యిల్లంతా చూపించింది సరళ.

'ఈ మాత్రం పోర్షనన్నా లేకపోతే తోచదు సుమండీ - బాత్ రూమూ లేవట్రీ సెపరేట్‌గా లేకపోతే అసలు కుదరదుమాకు. నూటపాతికయిస్తున్నాం' అంటూ మొదలుపెట్టి తను ఆమెముందు ఎంత గొప్పదో నిరూపించే అన్ని ప్రయత్నాలూ చేసింది సరళ. అంతావిన్న లత తన గోడు మొదలు పెట్టింది.

"యేమిటో వదినగారూ - అన్నయ్యగారికి వుద్యోగముండ బట్టి నాలుగూ కొనుక్కుని హాయిగా వుండగలుగుతున్నారు. పైవారని పైసా అడగక్కర లేదు.

మీ అన్నయ్యగారి పరిస్థితి చూడండి- ఏఒక్క వుద్యోగాన్నీ నిలబెట్టుకోరు- తన చదువుకి, హోదాకీ తగిన వుద్యోగం రాలేదని అన్నిటినీ విడిచి పెట్టేస్తున్నారు. చూడండి! మా యింట్లో ఒక విలువైన సామానులేదు — అమ్ముకుంది కన్నా ఒక నగలేదు - యేమైనా సంసారం మగవాడిమీద ఆధారపడి వుంటుంది - మగవాడు స్థిరమైన వాడైతే ఆడదానికి అంతకంటె అదృష్ట మేముంటుంది? స్థిరత్వమంటూవుంటే పెళ్ళానికి కొనేచీర దగ్గరనుండి స్వంతానికోయిల్లు కట్టుకునే వరకూ అన్నీ స్వయంగా చూసుకుంటారు - ఉన్న దాంట్లోనే క్లుప్తంగా గడుపుతారు.

మీ అన్నయ్యగారలాకాదు. ఈ రోజు వంద తెచ్చారంటే అవి ఆర్పేసేవరకూ నిద్ర పట్టదాయనకు. ఇక ఫ్రెండ్సుతో సినిమాలకు వెళ్తే గొప్పకోసం పదులూ పాతికలూ ఖర్చుచేస్తారు. యింట్లో బియ్యం లేవని తెల్సినాకూడా. చూడండీ మనం ఆడవాళ్ళం — మనమే యేదో పొదుపు చెయ్యాలి. వాళ్ళ దుబారాని అరికట్టాలి ఈ మాటపైకంటే ఆయనకు కోపం - 'నేనేం దుబారా చేశాను.' అంటారు. మీరే ఆలోచించండి పుట్టింది ఆడపిల్ల - రేపుదాని బాధ్యతంతా మోసి దాని ముద్దూ ముచ్చటా ఎవరు చూస్తారు చెప్పండి? ఈ చీర చూడండి నూటనలభై పెట్టి కొన్నారు - ఇంతకు ముందు చేసే వుద్యోగం వూడినప్పుడు చేతికొచ్చిన మూడొందలుపెట్టి యీ చీర కొన్నారు - అయనో టెర్లిన్ జత కుట్టించుకున్నారు. వద్దని అనను - కానీ మన పరిస్థితి కూడ చూసుకోవాలి కదండీ"

లతమాటలు వింటూంటే సరళలో కొంత చైతన్యం కలిగింది. లత చెప్పినది నిజమే-




మగవాడి అండలేకపోతే ఆడదెందుకు పనికొస్తుంది? అలాగే స్థిరత్వంలేని మగాడితో చేసే కాపరంకంటె ఆడదానికి నరకమే మేలు!

భోజనాలై వాళ్ళు వెళ్ళిపోయినా లత మాటలే సరళ మనస్సులో నాటుకుని బలంగా పనిచేయడం మొదలుపెట్టాయి.

అన్ని విధాలా తనకు అనువైన భర్త లభించాడు. కానీ తనే పైపై ఆశలకులోనై జీవితాన్ని నరకం చేసుకుంటూందేమో ననిపించింది.

ఆ రాత్రి వంటరిగా పడుకున్న రాజారావుని గట్టిగా ప్రేమతో హత్తుకుంది సరళ – నిద్ర వస్తున్న రాజారావుకి పరిస్థితి అర్థమై నవ్వుకున్నాడు–స్నేహితుడి యుక్తి పనిచేసినందుకు సంతోషించాడు - అలా ఒకరికొకరు దగ్గరైన రాజారావూ సరళా మరి జీవితంలో వేరుకాలేదు.

—————

# పంకజం-పనిమనిషి!

ముదిగొండ శివప్రసాద్



'ఏమేవ్ ! ఇలా రా ఒకసారి-' చదువుతున్న పుస్తకంలోనుంచి తల బయటకుతీసి కళ్లజోడు ముక్కుమీదికి లాగి పరబ్రహ్మం వేసిన కేకకు ప్రతిధ్వనేమో అన్నట్లు 'ఏమండోయ్ ఇలారండి ఒకసారి' అని కేకపెట్టింది పంకజమ్మ వంటింట్లోనుంచి—

'ఏమేవ్-ఇలారా ! ఉరుక్కొంటూ రా-పరుగెత్తుతూ రా... చూశావా-చూశావా-సావర్కార్ కూడా ఏమన్నాడో - ఇన్నాళ్లు నుండి నేను చెపుతున్నదే ఆయనా ఈపుస్తకంలో ఒప్పుకున్నాడు- ఆ రోజు రాత్రి వర్షం పడ్డదని నేను అనలేదూ ... అదే నిజం - ఈయన

వర్షం పడ్డదనే అన్నాడు...ఇదుగో ఇలా — రా. ఇంకా రాలేదేమిటి ?'

'ఇదుగో ఇలారాండీ – నేను మొదటి నుంచి మొత్తుకొటుంటే విన్నారా, వాడు చేరిన నాడే దొంగవెధవ – వాడి చూపులే అదోలా వున్నాయని అన లేదూ–నిన్న జీతం తీసుకున్నాడు పత్తా లేదు—ఇవ్వాళ స్టీలు గ్లాసు కన్పించడం లేదు.' పంకజమ్మగారు వంటింట్లోంచి కేక.

పరబ్రహ్మం చేతిలో పుస్తకం టేబిల్ మీద పెట్టి, కొండ మహమ్మద్ దగ్గరకి రాకపోతే తానే కొండ దగ్గరకి పోయి నట్లు కంగారుగా వెళ్లాడు.

'ఏమేవ్ - విన్నావా – చూడు ఇంత కాలం నేను వాదిస్తున్న దానికి ఆధారం కన్పడింది. సోపపత్తికంగా సప్రమా ణంగా నిరూపణ కన్పడింది అందు లోనూ వాళ్లూవాళ్లూ కాదు సాక్షాత్తు సావర్కారే అన్నాడే – ఆ రోజు రాత్రి వర్షం పడిందని–'

'ఏ రోజండీ.'

'అదే ! అలగ్జాండరూ — పురుషోత్త ముడూ యుద్ధం చేశారే—ఆ క్రితంరోజు రాత్రి పెద్ద వర్షం పడింది. ఆ వర్షం అల గ్జాండరు గుర్రాలకుఇబ్బంది-ఏనుగలకేం మత్తేభాలు-హాయిగా తొండాలెత్తుకొని పోతాయి–'

'ఇంతకూ మీరనేదేమిటండీ'

'అనేదేముందీ – ఆ యుద్ధంలో ఓడింది పురుషోత్తముడు కాడూ – అల గ్జాండరేననేది సిద్ధాంతం...' 'బాగుంది– మీరూ మీ సిద్ధాంతాలు - రెండువేల ఏళ్ల కింద ఎవరు ఓడారూ, ఏనాడు వర్షం కురిసిందీ అన్నదాన్ని గూర్చి కలలు కంటూ కూర్చోండి – ఇక్కడ ముందు స్టీలుగ్లాసు కన్పించటడంలేదు.'

'ఏం స్టీలుగ్లాసు...'

'ఆ పెద్ద కాఫీస్టీలు గ్లాసు...'

'ఎక్కడవుంది ?'

'అది తెలిస్తే మిమ్మల్ని నేనెందుకు కేకవేసి పిలుస్తాను ? నిన్నటి పనివాడు చెంగయ్యే తీసుకుపోయి వుంటాడు– వాడి చూపులు చూసే అనుకున్నాను వట్టి దొంగవెధవని' – 'అబ్బే ! అలా తొందర పడకు పంకజం– పని మనుషు ల్నందరిని దొంగలనీ సోమరిపోతులనీ అనడం మన కలవాటయిపోయింది– నిదానంగా వెతుకు–ఏ బాతురూంలోనో ఏ నందివర్ధనం చెట్టు మొదట్లోనో దొరికి తీరుతుంది చివరకు.'

'అవునులెండి – నా జాతకమదేమో కాని ఎప్పుడూ ఆ పనిమనుషుల్ని వెన కేసుకొని వచ్చి ఇంట్లోవాళ్లని నానా మాటలు అనడమే తప్ప వాళ్లెందుకు చెప్పారు – ఇందులో సత్యా సత్యాలు ఏమిటీ అని ఎన్నడైనా ఆలోచించిన పాపాన పోయినారా ! ఎప్పుడైనా పని మనుషులతో దెబ్బలాట వస్తే నా మీద రవ్వంతైనా సానుభూతి చూపారా ?'

"ఇందులో సానుభూతి సమస్య ఏముంది పంకజం-వాళ్ళు పనిమనుషులు- ఏదో నౌకరీచేసుకొని డబ్బులు సంపాదించుకొంటారు—మనం నౌకరీ చేయించుకొని డబ్బులు పారేస్తాము. అంతే సంబంధం-దానికిగాను వాళ్ళమీద అభాండాలు వేసి అత్యాచారాలుచేసి మన ప్రతి లోపానికీ పనిమనుషులను తిట్టడం బాగా లేదు."

"ఇది నా ఖర్మం-అయినా మిమ్మల్ని పిలిచి చెప్పడ మేమిటి నేను-పోయి ఓ లేబర్‌పార్టీ పెట్టుకోండి. పది ఓట్లు పడి ఎం.ఎల్.ఏ. అయితే ఈ ముష్టి టీచర్ ఉద్యోగానికన్నా లాభసాటిగా వుంటుంది. వెళ్ళండి-వర్షంలో అలగ్జాండరు గుర్రాలు బురదలో కూరుకుపోతే వాటిని ఎలా బయటకులాగారు? చేంతాడులు కట్టారా? లేక మనుషులు నాలుగువైపులా పట్టుకొని మోశారా?- పోయి అధారాలు పరిశీలించండి..." విసురుగా అవతలి గదిలోకి పోయింది పంకజమ్మ!

పరబ్రహ్మం మరేం మాట్లాడకుండా మళ్ళా తన రీడింగ్‌రూంలోకి వెళ్ళి కూర్చున్నాడు.

పంకజమ్మ పనిమనుషులమీద నేరారోపణలు చేయడం ఇది మొదటిసారి కాదు. తన్మూలంగా యింట్లో పోట్లాటలు రావడమూ ఇది ప్రథమంకాదు.

ఒకసారి స్టీలుస్పూను కన్పించలేదని యాదయ్యను మాన్పించింది పంకజం. తీరా చూస్తే ఆ స్పూను మర్నాడు పక్కవారి గోడపైకాకి పెట్టినట్లుతేలింది.

మరోసారి అయిదు రూపాయల నోటు కన్పించలేదని చంద్రయ్య మీద నేరారోపణ.

వాణ్ణి అడ్డమైన తిట్లూ తిట్టి, నాలుగు తగిలించి 'నిజం చెప్పు - మేము ఏమీ అనము' అని బలవంతంపెట్టగా పెట్టగా చివరకు నేనే తీసుకున్నాను బాబో-క్షమించండి' అని ఏడుస్తూ పారిపోయాడు.

మర్నాడు పనిలోకి రాలేదు-"వెధవ, జీతం ఎట్లా తీసుకుంటాడో చూస్తాను-" అని మండిపడింది పంకజం!

తీరా విచారిస్తే పెద్దవాడు రామూ ఆ అయిదు పట్టుకుపోయి సినిమాకు ఖర్చు పెట్టాడని తేలింది -

ఇలాంటి సంఘటనలు చాలా జరిగాయి ఇంట్లో -

అందుకే పరబ్రహ్మానికి పంకజం పనిమనుషుల గూర్చి ఎప్పుడు ఫిర్యాదు చేసినా తొందరపడకూడ దనిపించేది - దానికి తగ్గట్టే జరిగేది కూడాను.

అలాగని పనిమనుషులంతా దేవతలనీ ఆకాశంనుంచి మన ఇళ్ళను తీర్చి దిద్దడానికి దిగివచ్చిన గంధర్వులని కూడా పరబ్రహ్మం భావంకాదు. వాళ్లు దొంగతనాలు చేయడాలూ, బియ్యమూ, సామానులు చాటుగా మోసుకుపోవడాలూ డబ్బు తీసుకుపోవడమూ - అన్నీ జరుగుతున్నవే! అలాగని తొందరపడి ప్రతి

మనిషినీ దొంగగా బ్రాండ్‌చేసి పీకేస్తే నష్టపడేది ఎవరు ?? ఇదీ పరబ్రహ్మం వాదం -

తనకు తెలుసు ఈ పాటికి చెంగయ్యే నప్పుడే పంకజమ్మ డిస్మిస్ చేసి వుంటుంది -

మళ్ళీ పనిమనిషి సమస్య మొదలు -

అసలీ పనిమనుషుల మీదన్నే రీసెర్చి చెయ్యాలనుకున్నాడు పరబ్రహ్మం - అందుకు కావలసిన పాయింట్లు కూడా కొన్ని వ్రాసిపెట్టుకున్నాడు. అయితే ఒక సారి అది పంకజమ్మ కళ్ళలో పడటం మూలంగాఅర్థాంతరంలోనే ఆగిపోయింది.

'మీ పరిశోధనలూ ఉపపరిశోధనలూ మాని, ముందు ఓ పనిమనిషిని వెతుక్కు రాండి. పొద్దుటి నుంచీ చేసుకోలేకుండా వున్నాను' అని తన్ను బయటకు పంపి ఆ కాగితాలు దాచేసింది.

అందులో నిజానికి పరబ్రహ్మం రీసెర్చికి కావలసిన ప్రాథమికాంశాలన్నీ సేకరించాడు.

పనిమనుషులనేవారు ఒక కులానికీ వర్గానికీకూడా చెందివుండరు. వాళ్ళల్లో రూపాలలోనూ గుణాలలోనూ కూడా సామ్యం వుండదు.

వివిధ కులాలకూ తరగతులకూ చెందినవారు పనిమనుషులుగా వస్తారు.

చాలామందిలో వుండే స్వభావ సిద్ధ గుణం ఏమంటే సాధ్యమైనంత తక్కువ పనిచేసి ఎక్కువ మూటకట్టుకొని పోవాలని వుంటుంది.

ఎంతకూ సంతృప్తి వుండదు.

ఈమాటే ఓసారి పంకజం ఓ పనిమనిషితో అంటే ఆ పనిమనిషి అడగవలసిన నాలుగూ అడిగాడు.

"ఇదిగో పంకజమ్మగారూ - నేనేం మీ ఇంట్లో పనిమనిషి ననుకున్నారా లేక బానిస ననుకున్నారా - ఆ మాట కొస్తే మీ ఆయన మాత్రం పనిమనిషే గదా? నేను చిన్నపనిమనిషినైతే ఆయన పెద్ద పనిమనిషి - నాకు సంతృప్తి లేదంటారు. ఎవరి కుందండీ ఈ కాలంలో- తక్కువ పనిచేసి ఎక్కువ జీతాలు గుంజాలనేగా అందరి పాలసీ. అసలు పని చేయకుండానే జీతాలు గుంజేవారి మాటేమిటంటారు? నే నింకా శ్రమజీవినండీ. మాటంటే పడను-' అని ఇలా ప్లీడరు పాయింటు తర్వాత పాయింటువాదిస్తుంటే పరబ్రహ్మం విని "ఔరా" అని నివ్వెరపోయిన రోజొకటి లేకపోలేదు.

అయితే అలా వాదించే మనుషులు నూటికి కోటికి ఒకరు అరుదుగా దొరుకుతారు తక్కిన వారంతా సామాన్యంగా 'నస' పెట్టడమో గొణగడమో చేస్తుంటారు. లేదా ఓపికున్నంతవరకూ చేసి అందినంతవరకూ మూటకట్టుకుని చెప్పకుండా చెక్కేస్తుంటారు.

'ఏమండీ ఆ చెంగయ్య కనిపించడం

లేదు. మళ్ళీ రీడింగ్‌రూంలోకే చేరారా ఏమిటి!' పంకజం కేకతో ఉలిక్కిపడి వాస్తవలోకంలోకి వచ్చాడు పరబ్రహ్మం!

మళ్ళీ పెద్ద సమస్య!

ఎ బిగ్ క్వశ్చన్ మార్క్!!

పనిమనిషి! సర్వెంట్ మెయిడ్!!

చరిత్రపుస్తకంమూసి చెప్పులు తొడుక్కొని ఇంట్లోనుంచి గుమ్మంలోకివచ్చి నిలబడ్డాడు పరబ్రహ్మం!-

రోడ్డుపై జనం అలా పోతున్నారు ఎవరి పనులకు వాళ్లు ఆదరాబాదరా.

ఎంతమంది జనం - ఎన్ని రిక్షాలు - సైకిళ్లు! వీళ్ళల్లో పనిమనుషు లెవరో ఎలా పట్టుకోవడం??

ఏ పరీక్షతో ముందు నిర్ణయించడం?

పరబ్రహ్మం ఆ దిక్కూ ఈ దిక్కూ చూచి పక్కనున్న కూర్మావతారంగారింటికి పోయాడు

"రండిరండి పరబ్రహ్మంగారూ - ఏమిటి ఇలా వచ్చారు విశేషం."

"ఏముంది - మా పనిమనిషి పారిపోయిందండీ."

"శుభం!— కూర్చోండి. సమయానికే వచ్చారు నేనూ పనిమనుషుల సమస్య ఆలోచిస్తున్నాను."

"ఆలోచిస్తే లాభంలేదు. అవతల మా ఆవిడ పనిచేసుకోలేక చిందులు తొక్కుతున్నది. ఉన్నవాడికి దొంగతనం అంటగట్టేసరికి చెప్పకుండా పారిపోయాడు."

"పోనీలెండి దిగులు పడవద్దని చెప్పండి. మరో అర్ధగంటలో మీ ఇంటికి పనిమనిషి వస్తుంది, వెళ్లండి."

"ఏం కూర్మావతారంగారూ, నిక్కచ్చిగా చెప్పగలుగుతున్నారు."

"అవును - ఇందాకనే మా ఇంట్లో రంగడు తన భార్య లచ్చికి పని చూపించండి ఎక్కడైనా అని చెప్పాడు."

"సరే నన్నాను. ఈ సంభాషణ అటు జరిగిందో లేదో ఇటు మీరువచ్చారు దైవవశాత్తు, ఇప్పుడే రంగణ్ణి పంపి లచ్చిని పిలిపిస్తాను పదండి."

పరబ్రహ్మానికి కలయో వైష్ణవ మాయయో అన్నట్లుంది ఇదంతా. పనిమనిషి ఇంత త్వరగా నిమిషాలమీద మళ్ళీ దొరుకుతుందని మాత్రం అనుకోలేదు పొరపాటున కూడా.

"ఏమేవ్ ఏంచేస్తున్నావ్. ఇదిగో పనిమనిషి వస్తున్నది. చూశావా - పిలుచుకొచ్చాను. కుదుర్చుకొచ్చానే."

"ఏమిటండీ"

"అవునే-పనిమనిషి దొరికింది."

"ఆహా!-ఎవరూ - ఏమిటీ."

"మన కూర్మావతారంగారింట్లో పని చేస్తాడే రంగడు వాడి భార్యట!"

"ఎలా చేస్తుందిట పని"

"ఏమో మరి-"

"నఖగుడూ దొంగబుద్ధులూలేవుగా"

"తెలియదు"

"ఎంత ఇవ్వాలని అడిగారు."

"ఇంకా అడగలేదు."




''ఇంతకు ముందు ఎవరి ఇంట్లో చేసిందో"

"తెలియదు."

"మరేమిటండీ మీరు తెలుసుకు వచ్చింది''-

"రంగడి పెళ్ళాం పనికి వస్తుందని''

"రంగడు - బుంగడు-వాడే మనకు తెలియదే వాడి పెళ్ళాం అంటే అదేం సర్టిఫికెట్టు ?"

"నిజమే సుమా!'' భార్య అన్నదాన్లో కూడా పాయింటు లేకపోలేదనిపించింది పరబ్రహ్మానికి !

"తొందరపడకే వస్తుందిగా - అన్నీ మాట్లాడుకోవచ్చు అప్పుడు"

పంకజం ఎందుకో ఒక్క-క్షణం 'సరే' లెమ్మన్నట్లు తలవూపి కాస్త ఆగింది.

మళ్ళీ అన్నది ''ఇదిగో ముందే నిక్కచ్చిగా మాట్లాడాలి అన్నా. మంగళవారం శుక్రవారం ఇల్లంతా కడగాలి."

"అలాగే"

"గదులన్నిటికీ ఫ్లిట్టు కొట్టాలి. వెంట వెంట బూజులూ గట్రా దులుపుతూ వుండాలి '

"బూజు దులుపుతుందిగాని, గట్రా ఎలా దులుపుతుంది?''

"ఇదుగో నాకు కోపంతెప్పించకండి. మీరూ మీ పరాచికాలూను. అన్నీ ముందే మాట్లాడుకోకపోతే నెత్తినెక్కి కూర్చుంటారు తెలుసా? తర్వాత...''

"అలాగే"

"రామూకు సమస్తం అందించాలి. మీకు నీళ్లు అవీ తోడిపెట్టి పిలిస్తే పలికేటట్లుండాలి. విజ్జీగాడిని అలా వీధులు తిప్పి ఆడించుకురావాలి. లీలకు తల

దువ్వి జడవేసి స్కూలు దగ్గర దింపి రావాలి. ఇవన్నీ ముందే మాట్లాడండి - తెలిసిందా ?''

"తెలిసింది. కాని ఇంట్లో సమస్తం చేయాలంటున్నావు నిజ్జీని వీధుల్లో తిప్పాలంటున్నావు. ఒకే మనిషి ఇంట్లోనూ వీధిలోనూ కూడా ఎలా వుండగలదంటావు కామరూపం లేకుండా''

"రామచంద్రా-రామచంద్రా ; ఈయనతో నేను వేగలేను తండ్రీ..."

"ఆఁ-ఆఁ చెప్పు-చెప్పు."

పంకజమ్మ కోపం కొంచెం తగ్గాక మొదలెట్టింది

"సర్ఫ్ పౌడి మళ్ళీ మళ్ళీ అడగకూడదు. చింతపండు ముద్దలుముద్దలు కావాలనగూడదు,"

"అలాగే"

బట్టలు మల్లెపూలలాగుండాలి. అంట్ల గిన్నెలు ధగధగ మెరిసిపోతూండాలి."

"అలాగే"

"నాలుగురోజులుచేసి ఎగగొడితే ఒక రోజుకు రెండు రోజుల జీతం కోస్తాను"

"ఊఁ''

"చేరీచేరక ముందే ఎడ్వాన్సు అడగకూడదు.''

"అలాగే అడగను''

"ఏమిటండీ అదీ"

"అవును పంకజం. ఏ ఐ. సి. ఎస్. పరీక్షకు వస్తున్న అభ్యర్థిని అడిగినట్లు అవన్నీ ఆ వచ్చిన పనిమనిషి నడుగు. ఆమెకే చెప్పు. నన్నడిగితేనేనేంచెప్తాను.''

"చాల్లెండి. మీరూ మీ మాటలూ..."

"పంకజం ! అన్నానని కోపం తెచ్చుకోకు. మనిషిని వంగిన నడుం ఎత్తకుండా ఊపిరిపీల్చుకోకుండా ఎలా పిండివేయాలో మీ నాయనకు బాగా తెలుసు. అయితే ఆయనకు ఆఫీసువారిచ్చిన నౌకరు వున్నాడు. దానితోబాటు ఆఫీసులోని నౌకరును కూడా చూసీచూడకుండా స్వంతపనులకు వాడుకునేవాడు. కాని వాళ్ళంతా ఏదో పొట్టతాపత్రయం కోసం వచ్చే పనిమనుషులు. వీళ్ళనలా నల్లుల్లానలపాలంటే సాధ్యపడదు పంకజం!"

"రామచంద్రా ! రామచంద్రా ! మళ్ళీ నన్నే అంటున్నారా...నన్నే..."

"నిన్ను కాదు పంకజం"

"నన్నే అంటారు. ఆ ముష్ఠి పనిమనిషిపాటి చెయ్యకపోయాను. ఛీ! ఏం బ్రతుకు నాది'' విసురుకుంటూ లోపలికి పోయింది పంకజమ్మ !

* * *

"ఏమండోయ్ ! ఏం చేస్తున్నారు ?''

"ఏంలేదు. ఏదో వ్రాసుకుంటున్నాను.''

"ఇలా రండి ఓ సారి.''

"వస్తున్నా పంకజం''

"వద్దులెండి నేనే వస్తాను"

పంకజం వచ్చింది.

పరబ్రహ్మం కలం కాగితం పక్కకు



పెట్టి శ్రద్ధగా సర్వేంద్రియాలూ పంకజం వైపుకు కేంద్రీకరించి కూర్చున్నాడు.

"ఇదిగో. ఇది చూచారా"

"ఏదీ చూడలేదే!"

"ఖర్మా! ఖర్మ! ఈ లచ్చిని చూచారా?"

"ఏం చేసింది - ఏదైనా గ్లాసు..."

"ఏమిటండీ ఇది..." కసిరినట్లుగా అన్నది పంకజం!

"చెప్పుచెప్పు - లచ్చి అనేసరికి ఏం తీసిందోనని తెలియక తికమకపడ్డాను."

"చాల్లెండి మీరు"

"ఆఁ- ఇంతకూ లచ్చి ఏంచేసింది? పని సరిగ్గాచేస్తున్నదా లేదా."

"అదేనండీ! చూసి రమ్మంటే కాల్చి వచ్చేటట్లున్నది ఇది."

"అంటే"

"పని చెప్పకముందే చేసేస్తున్నది.

ఒకటి చేయమంటే నాలుగు చేస్తున్నది. గుండెలదరిపోతున్నై దీని పనిమాస్తుంటే"

"ఇంకేం మరి పని నీకు నచ్చింది కదా!"

"నచ్చడ మేమిటండీ...అయినా దాని కెందుకింత శ్రద్ధ పనిమీద అని నా కాశ్చర్యం కలుగుతున్నది."

"అదేమిటి పంకజం! మనం పైస లిస్తున్నాము, అది పనిచేస్తున్నది."

"ముష్టిపైసలు, జీతం కూడా బేరం చేసుకోకుండా చేరింది. పైసలు కోసమే ఇది ఇంతపని చేస్తున్నదంటే నేను నమ్మను"

"అయితే ఏమంటావు"

"అదే తెలియడంలేదు."

"పోనీ కొంచెం పరిశోధించు."

"చూడండీ. అది రామూ బూట్లకు పాలిష్‌చేస్తూ అదోలా నవ్వుతున్నదండీ"

"పోనీ హసన్ముఖ! పాపం నగలు లేకపోతేనేం చిరునవ్వే ఆమెకు చంద్ర హారం పంకజం"

"బోడినవ్వు - వేళాపాళా లేకుండా అలా నవ్వడం తప్పకాదటండీ. ఎందుకు నవ్వాలి అలా?"

"బాగుంది. నవ్వును కూడా నువ్వు నిషేధిస్తావా ఏమిటి పంకజం! నన్ను చూచి కూడా పదిసార్లు నవ్వింది లచ్చి."

"మిమ్మల్ని చూచే."

"ఆ - నన్ను చూచే - ఊం నవ్వితే బాగా తెల్లగా ముత్యాల వరసలావున్నాయి దానిపళ్ళు. నవ్వినా అందంగా వుంది."

'అవ్వ-అవ్వ—'

'అలా పెదవులు నొక్కు కోకు పంకజం! నా కెందుకో లచ్చి చాలా మంచిపిల్లలా కన్పడింది – నిర్మలమైన చిరునవ్వుతో కూడిన ఆ మొఖం-సన్నగా సన్నజాజి తీగెలా చకచకా పని చేసుకుంటూపోయే దాని చురుకుదనం. మాటన్నా కూడా ఎగిరిపడకుండా తల వంచుకొని ఓపికతోపోయే దాని నేర్పూ ఓహో! లచ్చిలో చాలా అందమైన గుణాలున్నాయి పంకజం!'

పంకజం కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

రక్తంలో పోటు హెచ్చింది.

'ముష్టిపనిముండ! దీన్నిప్పుడే తరిమేస్తాను - ఇంట్లోంచి. నా కొంపకు ఎసరు పెట్టేటట్లు ఇది - ఇదీ దీని పనీ మండా.'

'అయ్యో! అయ్యో - బాగా చెయ్య లేదని అందరినీ మానిపిస్తే బాగా చేస్తోందని దానిని మానిపిస్తావా పంకజం.'

'మీరిక మాట్లాడకండి. బుద్ధిలేని పెద్దమనిషీ-పనిమనిషి నవ్వుపై పరిశోధన చేస్తున్నారన్న మాట మీ రిప్పుడు.' వణికిపోతున్నది.

పంకజం రక్తపోటు హెచ్చు స్థాయికి పోయింది!

పరబ్రహ్మం కంగారుపడి రామును కేకవేసి డాక్టరుకు కబురుపెట్టాడు.

*　　*　　*

'రాండి రాండి పరబ్రహ్మంగారూ' పుస్తకం పక్కన పెట్టి ఆహ్వానించాడు కూర్మావతారం.

పరబ్రహ్మం ముఖం వ్రేలవేసుకొని కొర్చున్నాడు

'అదేమిటండీ ముఖం తోటకూర కాడలా వేలవేశారు.. ఇదిగో ఇందులో డబ్ల్యు.ఆర్.ఇంగ్ ఈ "స్పూన్‌ఫీడింగ్" అన్న వ్యాసంలో ఏం చెప్పాడో చూచారా ?.'

'ఏం చెప్పాడు ?'

'ప్రాచీన మానవులు పచ్చిమాంసాన్నే పీక్కొని తినేటంత బలంగల పళ్లతో వుండేవారు కదా - ఈ చెంచాల యుగంలో ఎందుకని యవ్వనం రాక ముందే పళ్లు పీకి పళ్లు కట్టుకోవలసి వస్తున్నది ? అని ప్రశ్నవేసుకొని కేవలం సోమరితనమూ పని యెడల వైముఖ్యమే దీనికి కారణమనీ సుఖం పేర నాగరకత పేర అలసత్వానికి అలవడు టకు ఈ పతనానికి కారణమనీ వర్ణిం చాడండీ.'

'భేష్ ! దాన్నొకసారి మా ఆవిడకు వినిపిస్తే బాగుండును కూర్మవతారం గారూ...'

'అదేమిటీ రంగడి భార్యను పని లోంచి తీసేశారుట కదా ! రంగడు చెప్పాడు ఇందాక.'

'అదో కథ - తర్వాత చెప్తాను. ఆవిడ బి.పి. ఎక్కువై మంచంపై పడివుంది.'

'ఎందుకని ?'

'ఎందుకని అంటే నేనేం చెప్పను కూర్మావతారంగారూ. దాని ఖర్మ అది. డాక్టరు వచ్చి పరీక్ష చేసి మీరేం కంగారు పడకండి - మీ పనులన్నీ మీరే స్వయంగా చేసుకోండి. ఏ అనా రోగ్యమూ వుండదు. చూడండి అదుగో ఆ పనిమనిషిని, ఎంత నవ్వుతూ ఆరోగ్యంగా కళకళలాడుతూ వుందో- మరి మీరు చూద్దామంటే కీళ్ల నొప్పులూ బి పి. ఎందువల్ల నంటారు ? అని అచ్చి తోనే డాక్టరు కూడా మళ్లీ పోలిక తెచ్చే సరికి పంకజం బి.పి. పట్టశక్యం కాకుండాపైకిలేచిపోయిందికూర్మావతారం గారూ.'

'అరెరే ! పదండి నేనూ వచ్చి చూస్తాను.'

'ఫరవాలేదులెండి... ప్రస్తుతం కాస్త ఫరవాలేదు. లేచి కూర్చొని అచ్చిని ముందు పనిలోంచి తరిమేసి ఓ ప్రతిజ్ఞ పట్టింది'

'ఏమని'

'పని మనిషి అనే పేరు గల జీవిని, గుమ్మంలోకి ఇక తన జన్మలో రానివ్వనని'

# అహం * గోపీచంద్

ఒక కవి ఒక సభలో ఈ విధంగా ఉపన్యసిస్తున్నాడు:

"మీరు కనిపెట్టారో లేదో కాని నేను తిక్కన కంటె గొప్పవాణ్ణి. నా కవిత్వంలో తిక్కన కవిత్వంలో ఉన్న గుణాల కంటె గొప్ప గుణాలున్నాయి. ఇంతవరకు భారతదేశంలో పుట్టిన వాళ్ళలో తిక్కనకంటె గొప్పకవిని నేనే..."

ఒక సభికుడు చివాలున లేచి – 'తిక్కన కంటె మీరు గొప్పకవులను కోటానికి దృష్టాంతరం ఏమిటి?'

"దృష్టాంతరమా?-దృష్టాంతరమా'' అని నడుంకొట్టడం మొదలెట్టాడు కవి.

ఇంకో సభికుడు లేచి ఈ విధంగా జవాబు చెప్పాడు -

"ఈ దృష్టాంతరాలకేం, కావలసినన్ని ఉన్నాయి. తిక్కనా కవిత్వం రాశాడు. వీరూ కవిత్వం రాశారు. తిక్కనా పుట్టాడు; వీరూ పుట్టారు. వీటిని బట్టి తిక్కనకూ వీరికి చాలా పోలికలున్నవని విశదం అవుతూంది. ఇక తిక్కన కంటె ఈయన గొప్పవాడెలాగంటూరా? తిక్కన చచ్చాడు; ఈయన చావలేదు" అని కూర్చున్నాడు.

కవి తెల్లమొహం వేశాడు.




(గత సంచిక తరువాయి)

లలితా స్తోత్రముతో ప్రారంభమయింది ఆనాటి సమావేశం. స్త్రీని అంత నగ్నంగా వర్ణిస్తుంటే సరళ తల తిరిగిపోసాగింది. అది పూర్తిఅవుతుండగా ఇద్దరు కన్యలు అతని తొడలపైకూర్చుని అతని బుగ్గలు చుంబించారు. సరళకు కంపరమెత్తింది.అత్తగారినేమో ప్రశ్నించబోయింది.

"ఉష్! ఆయన వారిని దేవీ మూర్తులుగా భావించాడు. అందుకే తొడలు ఆసనముగా చేశాడు." అత్తగారి సమర్థింపుకు మతిపోయింది. కాని ఆ గుంపు నుండి బయటపడటం సాధ్యం కాదని తెలిపోయింది. అతను ఏదో వేదాంతం చెప్పి నాల్గు వాక్యాలలో ముగించాడు.

'అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్టే చెప్పాడమ్మా జీవితసారము" అని ఒకరంటే,

"అందుకే త్రిలోకనాథుఖు

అయ్యారు,'' మరొకరు అన్నారు. అందరూ పొగిడేవారే.

"ఏకాంతసేవలో ఎవరు పాల్గొంటు న్నారు?'' యెవరో ప్రశ్నించారు. ఆవిడ ఇంట్లోనే గురువుగారి బస.

''మేము,'' అంటూ ఓ పదిమంది యువతులు పక్కకు నిలబడ్డారు. త్రిలోకనాథులు సరళనుగమనిస్తున్నారు.

''ఈమె యెవరు సుందరమ్మా?''

"నా కోడలు స్వామీ.''

"ఈ కాంత ముఖంలో నిత్యత్వం కనిపిస్తుంది.''

"నేను కన్యను కాను,' పెళుసుగా జవాబిచ్చింది సరళ.

''కన్య, కన్యాత్వము కోల్పోయినా దైవత్వము కోల్పోదు జానకమ్మా! అందరిని బయట ఉంచు, ఈస్త్రీముఖంత దేవీ ప్రసన్నం కావాలి. ఆ దేవే ఈమెను దరిద్రబాధలకు గురిచేస్తుంది.''

''నిజమా స్వామీ!'' సుందరమ్మ సాష్టాంగపడి లేచింది. ఒక్కరొక్కరే వెళ్ళిపోయారు. సరళ మొండిధైర్యంతో కూర్చుంది.

''ఇలా దగ్గరగా వచ్చి నీ వామ హస్తము చూపు.'' అలాగే చేసింది

''అహా అపూర్వమైన స్త్రీవి నీలాంటి స్త్రీలవల్లే రససిద్ధి జరుగుతుంది.'' అతని

చేతులు మెల్ల మెల్లగా శరీరభాగాలను తడుతున్నాయి.

"స్త్రీ ... స్త్రీ, పురుషుని కాంక్షల పాలిట కామధేనువు, అతని గమ్యానికి మార్గము; అనురాగమయి అయిన ఆత్మజ, అపురూప స్నేహమొలికించు సోదరి...మమతల నొలికించే మాతృమూర్తి స్వర్గద్వారమువరకు సారథ్యము వహించే ప్రియురాలు. ఈ అపూర్వమైన దశే ప్రేయసి దశ. మానసం, శరీరం మథింపబడుతాయి. నా కింతవరకు ఏ స్త్రీ ప్రేయసిగా దర్శనం ఈయలేదు."

"మీ ఉద్దేశం?" అతని చేయి తొలగించింది అతను ప్రసన్నంగా, మధురంగా నవ్వాడు

"అదే...నీవు శక్తి అంశవు నీలో సంభోగ కోర్కెలు బలంగా ఉన్నాయి కాని నీ భర్త... బలహీనుడు."

"ఆపండి." సరళముఖం ఎర్రబడింది.

"నా కౌగిలిలోకి వచ్చి, ఒకసారి ఆ మాటను."

"ఛీ...ఛీ..." చటుక్కున లేచి బయటకు వచ్చింది.

"ఏమ్మా, ఏదైనా అపచారం జరిగిందా నీవల్ల?" జానకమ్మ అడిగింది.

"ఏం లేదండీ...నాకేదో వికారంగా ఉంది వెళ్ళిపోతాను." జవాబుకు యెదురు చూడక, వచ్చేసింది. యెంత సిగ్గుచేటు. స్త్రీలంతా మూర్ఖులా? తనే

మూర్ఖురాలా? సమాధానం లేని ప్రశ్నలు చాలా లేచాయి.

సాయంత్రం అమ్మమ్మ, మనుమ రాలు వచ్చారు. "అత్తయ్యా! మీరు వెళ్ళండి. నిర్మల దేనికి?"

"లోకోద్ధారకుడైన పుత్రుడుకన్యలకే పుడుతాడే,నాకు కాదు. అందుకే స్వామి అన్నారు, మీ కోడలిలో నిత్యత్వం ఉందని భ్రమపడ్డాను, ఆమె ఒక మామూలు 'స్త్రీ' అని."

"అది కాదత్తయ్యా! అతని వాలకం నచ్చలేదు,"

"నీలాగ యెవరూ అనలేదు."

"అనడానికి సిగ్గు అడ్డం రావచ్చుగా. నామాట వినత్తయ్యా"

"ఏమిటే నీ బోడిమాట." ఈసడించి వేసింది. "నాకామాత్రం తెలియదా?నేను నిత్యం నియమ నిష్ఠలతో పూజలు జరిపే పుణ్యాత్ములఇంట పుట్టానే..."

"నా కదంతా తెలియదు. 'పూజ' అంటే ఓ సత్కార్యము, భగవంతు డిని మెప్పించేది అన్నారు. భగవంతుడు పూజామందిరంలో బంధింపబడి ఏం లేడత్తయ్యా. నీలో, నాలో, సర్వవ్యాప్త మయి ఉన్నాడు. నిర్మలమైన మనసే అతని ఆసనం. నిత్యం చేసే మంచిపనులే అతని పూజలు."

"పూజా పునస్కారాలు మూర్ఖులు చేస్తారంటావా?"

"కాదు అజ్ఞానులు మనసులో దాగిన

కల్మషం కప్పిపుచ్చడానికి చేసే కపట నాటకం ఈ క్రతువు."

"చాల్లే యెవరన్నా వింటే నవ్వి పోతారు." సుందరమ్మ కోడలిని ఈసడించింది. ఒకరోజు సంసారి అయిన సరళ, నిర్మలను పరిశీలనగా చూచి- కన్యాత్వం కోల్పోయిందని గ్రహించటానికి అట్టేసేపు పట్టలేదు. భర్తతో ఈ విషయము చెప్పింది.

"నీకన్నీ అనుమానాలే. నీకిష్టంలేదు మానెయ్యి. వాళ ను ఆపటం దేనికి?" రఘుకు ఈ మధ్య తల్లి సాధింపులు తక్కువయ్యాయి. అందుకే అతను త్రిలోకస్వామికి మనసులోనే ధన్యవాదాలు చెప్పుకున్నాడు.

ఆ సాయంత్రము నిర్మలను అడిగింది అతని విశేషాలు, ఏకాంతసేవ విషయాలు.

"అయ్యో ఆపచార మత్తయ్యా. యెవరితోను చెప్పకూడదు."

"నేను మామూలు స్త్రీనమ్మా. నాతో చెప్పడానికేం?" యెంతో నచ్చ చెప్పాక అసలు విషయం చెప్పింది. అది విని మాన్పడిపోయింది సరళ. నోట మాట కూడ రాలేదు. రానున్న ఉపద్రవము ఆపటం ఒక సుజాతవల్లే సాధ్యం అవుతుంది అనుకుంది.

## 28

సుజాత కెందుకో ఈ మధ్య పనిమీద ధ్యాస నిలవటంలేదు. ఏదో అసంతృప్తి. భర్తను అర్థంచేసుకోవటంలో తనే పొరపడిందని నమ్మకం కల్గింది. యువకుడు, అయితే ఆ భావాలు లేవు. మరమనిషిలా పని...పని...అంటాడు. ఈ మధ్య బాగా మాటలు తగ్గించింది. అతను అది గమనించనట్టే ప్రవర్తిస్తున్నాడు. బొత్తిగా రసహీనమైన బ్రతుకు అనుకుంది.

"ఏమ్మో...అంత పరధ్యాన!" సరళ రెండోసారి కుదిపితే ఈ లోకంలోకి వచ్చింది.

"బావున్నావా వదినా! అకస్మాత్తుగా వచ్చావేం?"

"మేనేజర్ గార్కి మొదట విన్నవించుకోవాలి కాబోలు."

"అదేం లేదు. ఏదేని గొప్ప విశేషం లేనిదే రావని..."

"నిజమే సుజా. అలా బయటకువెళ్ళి మాట్లాడుకుందాము,"

"అలాగే నాకూ వెళ్ళాలని ఉంది."

ఓ చిన్న చీటిరాసి పర్మిషన్ కోసం విష్ణుకు పంపింది.

సాంక్షన్ వచ్చింది.

"ఇదేమిటమ్మో"

''అదంతే. పద." ఇద్దరూ బయటకు వెళ్ళారు.

సరళ చెప్పింది విని మాన్పడిపోయింది సుజాత.

"నిజమా వదినా?"

"నిజమే సుజా. అబద్ధం యెందుకు చెబుతాను. ఒక్కసారి వెడదాం పద."

సుజాత వదిన వెంబడి రిక్షాలో పుట్టింటికి వెళ్ళింది.

తల్లిని, నిర్మలను చీవాట్లేసింది. తన అసమర్ధతకు అన్నగార్ని తిట్టింది.

"నీకేం తెలియదు. లోకకళ్యాణార్థమై ఓ పుత్రుడు కలుగబోతున్నాడే.."

"అమ్మా! లోక కళ్యాణం తరువాత దానిజీవితంనాశనంఅవుతుందే..''యెన్ని విధాలుగా చెప్పినా వినలేదు. చేసేదిలేక అక్కకు ఉత్తరం రాసింది. వెంటనే వచ్చి తన కూతుర్ని రక్షించుకోమని."

మనవాళ్లు సాధించిన ప్రగతి యింతేనా? ఇంకా స్వాములను సన్యాసులను నమ్ముతూ మోసపోవడమా? చదువుకున్నారెందుకు? విజ్ఞానములేని చదువు, అజ్ఞానాన్ని పెంచుతున్న చదువు లేకపోతేనే నయమేమో. పట్టణం నడిబొడ్డున నవనాగరికులుండే ప్రదేశంలో ఇలా ఉంటే, పల్లెల అందం చెప్పనవసరం ఉండదేమో. సుజాత రిక్షాచేసుకుని అత్త వారింటికి బయలుదేరింది.

రఘు మనసంతా అల్లకల్లోలంగా ఉంది. తల్లి మాట నిజమా, భార్యమాట నిజమా. అర్థంకావటంలేదు. మూర్ఖత్వం కాకపోతే ఈ ఇరవయ్యో శతాబ్దంలో లోకకళ్యాణార్థమై కుమారస్వామి జన్మించడమేమిటి? నిర్మల చెప్పిన మాటల్నిబట్టి ఆ పిల్ల పూర్తిగా చెడిపోయింది. రక్షించే మార్గమే లేదా? ఆలోచనలు అధికమైనప్పుడు మనిషి మానసికంగా బలహీనుడవుతాడు కొందరు నిద్రపోతారు. ~~~ ~~~

మరి కొందరు అవి మరిచిపోవాలని ఏదేదో చేస్తారు. రఘు పని అంతే అయింది. నెమ్మదిగా బార్‌లో దూరాడు. జేబులోఉన్న డబ్బు అయిపోయే వరకు అక్కడే కూర్చున్నాడు.

## 29

సుజాత ఇంటికి వచ్చేసరికి విష్ణు రాలేదు. సుశీలమ్మ రుసరుసలాడుతుంది. కమలమ్మకు జ్వరం వచ్చింది. కోడలు తొందరగా వస్తే అంతా ఆమె నెత్తిన రుద్దవచ్చు అనుకుంది. అనుకోకుండా ఆలస్యం అయింది. "మా విష్ణు మహాతెలివైనవాడు. కమలకు జ్వరం వచ్చిన సంగతి తెలుసు. భార్య ఎక్కడ అరిగిపోతుందోనని,అక్కడే ఉంచేశాడు. మేం లేము దాసదాసీ జనము." అన్నది వెటకారంగా.

కాంతమ్మ కూతురి దగ్గరకు వెళ్ళింది. ఇక యెన్నిమాటలన్నా యెవరడ్డు?

"లేదు చిన్నత్తా...వారేం ఉంచలేదు. అత్యవసరంగా అమ్మను చూడాల్సిన పని యేర్పడింది.

"పెత్తనాలు మీవి. ఎటయినా వెళ్లండి" అన్నది విసురుగా. కన్న సహాయముతో మిగిలిన పనిచేసింది. అప్పుడే వీరయ్య వచ్చాడు.

"అమ్మగారూ! చిన్న సూట్‌కేసులో బట్టలు సర్దివ్వమన్నారు అయ్యగారు. అర్జెంటుగా బొంబాయి వెళ్ళాలట. ఈ కవర్లో డబ్బు..."

"చిన్నత్తకివ్వు..." అతన్ని చూడకుండానే పైకి వెళ్ళిపోయింది. బట్టలు పెట్టుకుని వచ్చేసరికి సుశీలమ్మ సంబరంగా డబ్బు లెక్కచూచుకుంటూంది.

నాల్గు రోజులకే సుజాత పూర్తిగా నీరసించిపోయింది. ఒక సత్యం తెలిసి వచ్చింది. శాసించినా, ఆజ్ఞాపించినా, విష్ణు మనుష్యుల్ని పనిచేయటానికి, ఉత్సాహంగా ఉండటానికి ఉత్ప్రేరకం లాంటి వాడు. అతన్ని విడిచి ఉండటం ఎంత దుర్భరమో తెలిసి వచ్చింది. మనసులో పేరుకుపోయిన అశాంతి తగ్గాలంటే, ఒక్కసారి అతని బలమైన చేతులలో విశ్రమించాలి. అతని స్పర్శతో నూతనోత్సాహము పుంజుకోవాలి.

"అమ్మగారూ...పోయిన నెలఆఖరి వరకు రాబడి ఖర్చులు పూర్తిగా తయారయిన షీటు ఇవ్వమన్నారు."

"అయ్యగా రొచ్చారా?"

"ఇంటికి ఫోను చేశారే...మీకు తెలియదా? ఉదయమే వచ్చారు. వర్క్‌షాప్‌కు కొన్ని స్పేర్ పార్ట్స్‌వచ్చాయి."

"అలాగా! నాకు తలనొప్పిగా ఉంది. ఈ పూటకు పనంతా మీరుచూచుకోండి." లోపలికి వెళ్ళి ఫోన్ తీసుకుంది. ఆయన వస్తారా, వర్క్ ఈజ్ వర్షిప్ అంటారు.

ఈ వారం రోజుల నుండి మనసులో పేరుకుపోయిన మలినం పోవాలంటే ఆయనతో మాట్లాడాలి. అతనికి ఫోన్ చేసింది. విష్ణే యెత్తాడు.

"హల్లో...మీరేనా!...ఏమిటా కొత్త పిలుపు...నమస్కారం...మీరు వెంటనే ఇక్కడికి రావాలి...సుముఖంలో అన్నీ వివరంగా మాట్లాడుకుందాం—ఊహు,. ఈ ఒక్కరోజు నా మాట వినరూ... థాంక్స్..." అని ఫోన్ పెట్టేసి సోఫాలో కూర్చుంది. పదిహేను నిమిషాల్లో అతని 'జావా' కాంపౌండ్‌లో ఆగిన శబ్దం అయింది. అతను వస్తూనే గుమ్మంలో నిల్చుని రెండు నిమిషాలు సుజాతను చూచాడు. వెంటనే డాక్టరుకు ఫోన్ చేశాడు.

"ఛ... ఇప్పుడు డాక్టరెందుకు?" అన్నది కంగారుగా లేస్తూ.

"ఒక్కసారి ముఖం అద్దంలో చూచుకో. కళ్ళు లోతుకుపోయాయి. అసలు చాలా రోజులనుండి గమనిస్తున్నాను. అన్నంకెలికి లేస్తావు." దగ్గరగా వచ్చి, ఆమె చెక్కిళ్ళు మృదువుగా నిమిరాడు.

"అందరికి ఉండే మామూలు స్థితే.

డాక్టర్ వచ్చి చెప్పాల్సిందేంలేదు." అన్నది.

"అంటే..."

"కారణం నాకు తెలుసు."

"మరి చెప్పరాదూ "

"మీకిష్టమో, కాదో..."

"సుజా..."

"అవునండీ...మీరంతా ప్రణాళికా ప్రకారం జరగాలంటారు, కొన్నిసార్లు ప్రకృతి నియమాలకు దాసులు కాక తప్పదు..."

"ఏమిటీ" అతని కళ్లల్లో ఒక్క సెకండ్ అపూర్వమైన కాంతి తళుక్కు మంది.

"ఇంత మంచి వార్త ఇలాగేనా చెప్పేది, నువ్వు చాలా కఠినాత్మురాలివి. పైగా నిష్ఠూరం నాపై వేస్తున్నావా?"

"అది కాదండీ..."

"ఏదికాదు. అందరిలా నువ్వు భయం తోనే నన్ను సమర్థిస్తున్నా వన్నమాట. నన్నర్థం చేసుకుంది ఇంతేనా?" అతను ఆమెను వదిలివెళ్ళి కిటికీలోంచి తరాజులు, తూనికరాళ్ళు చూస్తూ నిలబడ్డాడు సుజాతకు తన పొరపాటు తెలిసివచ్చింది. అంత దురుసుగా మాట్లాడవల్సింది కాదు.

"నా మనసెందుకో చాలా అల్లకల్లో లంగా ఉందండీ." కంఠము బొంగురు పోయింది. వెళ్ళి సోఫాలో జారగిల పడింది. అతను తిరిగిచూశాడు. ఏమను కున్నాడో, నెమ్మదిగావచ్చి ఆమె పక్కన కూర్చున్నాడు.

"నీ బాధ చెప్పందే నా కెలా తెలు స్తుంది సుజా?"

"మీరు ఆ రోజే ఊరికెళ్ళారు!" త్రిలోకనాథుల ఉదంతము,. నిర్మల, తల్లి యెలా అతని పిచ్చివ్యామోహంలో చిక్కుకున్నారో వివరించింది. అతని కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"మీఅన్నయ్య చదువుకున్న మూర్ఖుడు సుజా."

"వదిన చెబితే అమ్మకు లక్ష్యం లేదు."

"అలాంటివారిని చూచి జాలిపడటం తప్ప, ఏం చెయ్యలేము. ఈ స్థితిలో నవ్వు మనసు నిర్మలంగా ఉంచుకోవాలి. మనింట్లో కూడా వాతావరణం బావుండి ఉండదు. అవునా?"

అతనే అడిగినప్పుడు చెబితేనేం? కాని అతను త్వరపడి యెవరి నేమన్నా తను బాధ్యురాలు అవుతుంది. అందుకే చెప్ప లేక పోయింది, చిన్నత్త అనే మాటలు.

"ఓ వారం రోజులు యెటయినా వెళ్దామా?"

"ఎక్కడికీ వెళ్ళాలని లేదు. ఇక నుండి మీరు నన్ను ఒంటరిగా విడిచి వెళ్లొద్దు."అతని భుజంపై తలవాల్చింది.

"మీరు యెదురుగా ఉంటే, ఇంకేం అక్కరలే దనిపిస్తుంది." అన్నది మెల్లగా.

"అందుకే అంటాను. నువ్వు ఫూల్ ి..." భుజంపై ఉన్న తల వడిలోకి సుకున్నాడు. కాలింగ్‌బెల్ మోగింది. తను ఆమెను లేపి, వెళ్ళి డాక్టర్‌ను ంటబెట్టుకు వచ్చాడు. పరీక్షచేసి, న్నగా నవ్వాడు.

"ఇది లేడీడాక్టర్ దగ్గర కెళ్ళాల్సిన సు."

"అవును. మీకు ఫోన్ చేశాక ప్పింది."

"నో ఫియర్. జనరల్ వీక్‌నెస్." సేపు మాట్లాడి విష్ణుపనివరస మెచ్చు ని ఫీజు తీసుకుని వెళిపోయాడు.

"ఇక తమరు విశ్రాంతి తీసుకోండి. ప్పటికే నాకు చాలా బిరుదులు చ్చాయి."

"ఎన్ని బిరుదులు వచ్చినా, మీరేం లించరుగా, మీలో ఉన్న కార్యదీక్ష, ట్టుదల ఆయ్యకు రవంతఉంటే బాగుం తును" అన్నది.

"లేనిదాని గూర్చి బాధ యెందుకు? ంలహీనతే వారి శత్రువు సుజా. అలో ించి నీ ఆరోగ్యం పాడుచేసుకోకు. అలా వెళ్ళి కాఫీ త్రాగి సినిమాకు వెడ దాము పద."

"ఏమిటీ రోజు చాలా ఉత్సాహంగా ఉన్నారు?"

"నిజం సుజా, యీ సాలెగూడు నుండి బయటపడతానని నేను అనుకో లేదు. ఈ నెలలో ఉదయ్ ఉద్యోగ ప్రయత్నంచేస్తూ వర్క్‌షాపులో ఉన్నాడు. ఎంత లాభం వచ్చిందని! ఇంకొక్క ఏడాది ఇలాగేఉంటే నాన్నగ్గారికిచ్చిన మాట నిలబెట్టుకుంటాను." అతని ముఖంలో ప్రసన్నత కన్పించింది.

"నాకు మాత్రం ఏం తోస్తుంది. ఇంటి దగ్గర – అప్పుడే సెలవు పెడితే "

"నీ ఇష్టం...లేచి ముఖం కడుక్కో" ఆమె బాత్‌రూమ్‌వైపు వెళ్ళిపోయింది.

## 30

అనుకోకుండా దిగిన కూతుర్నీ, అల్లుణ్ణీ చూచి తడబడింది సుందరమ్మ. పెద్దకూతురు రావటం, ఆమె తన కూతురిని స్వామికి ధారాదత్తంచేస్తానని అనటం వీళ్ళకు తెలియలేదు కదా.

"ఏమిటే నీ నగలు ఏళ్ళయినా తయారయ్యేటట్టు లేవు? మీ ఆయన తీపి మాటలతోనే కడుపు నింపుతారు."

"అది సరే, నాకు కావాలనుకుంటే చేయించుకుంటాను. అక్కయ్యే ఏది?"

"త్రిలోకనాథుల దర్శనానికి వెళ్లింది. ఆయన ఈ వారం మహాయజ్ఞము చేస్తున్నారు. చూడాలని వెళ్ళింది."

"అదికాదు సుజాతా! ఈ రోజు నల్గురు కన్యలను, మన నిర్మలతోపాటు ఆయనకు ధారాదత్తం చేస్తున్నారు." సరళ చెప్పింది.

"అవునేచేస్తుంది... కన్నతల్లిఇష్టంతో చేస్తున్నారు. నువ్వు మధ్య చెప్పడం

దేనికి? మీరంతా తల తీసివేస్తారా? నేను దొంగతనము చేశానా?"

"సుజాతా! మన కెందుకు? వెడదాం పద." విష్ణు లేచాడు.

"అయ్యో, మిమ్మల్ని అనలేదు నాయనా. మా కోడలిని అన్నాను. కూర్చో..."

"చూదండి, కోడలయినా ఇంటి పని వారయినా మంచిమాట చెబితే వినాలి. విరిసీ విరియని మొగ్గలాంటి నిర్మల జీవితం నాశనముకావటమా! అరవై ఏళ్ళ ముసలాడితో పెళ్ళా!"

"అలా అనకు నాయనా! అప చారము."

"మీమూర్ఖత్వానికి నవ్వాలోఏడ్వాలో తెలియటంలేదు. వెళ్దాం పదండి."

"యజ్ఞము ఇక్కడకాదు నాయనా.. నాకు కళ్ళతో చూచేయోగం లేదు. ఇద్దరు సంపాదిస్తూ, డబ్బులేదన్నారు."

"డబ్బున్నా ఇలాంటి పనులకు తగ లేసుకుంటారా? ఏ ఊళ్ళో ఈ యజ్ఞము జరిగేది?"

"కాకినాడలోఅతని ఆశ్రమములో."

విష్ణు బాగాకోప్పడి వచ్చాడు. తనకు తెలిసిన డి. ఎస్. పి. ద్వారా కాకినాడకు ట్రంక్‌కాల్ చేయించాడు.

"మనము వెడితే నేమండీ?" సుజాత అడిగింది.

"అవమానం పాలు గావడమే. మీ అక్కా, బావకు బుద్ధి ఉందా! అక్కడ విద్యాహీనులు, పల్లెటూరి వారెవరూ లేరు. అంతా చదివిన మూర్ఖులేనట. ఇది వరకే పోలీసులకు రిపోర్టు వెళ్ళిందట."

ఆ రోజు ఇద్దరూ ఇల్లు చేరేసరికి రాత్రి పదిదాటింది.

మూడు రోజుల తరువాత త్రిలోక నాథుల లీలలు వర్ణిస్తూ పత్రికల నిండా వార్తలే. అతనుచేసే కామయజ్ఞానికి యెందరో కన్యలు బలి అయ్యారట. అతని ఆశ్రమంలో ఖాళీ సారా బుడ్లు కోకొల్లలు దొరికాయట అతను కొందరు కన్యతోల పారిపోయాడట. ఆ కన్యల లలో నిర్మల కూడా ఉందట.

'దాని కడుపున భగవంతుడు పుట్ట నున్నాడు.' అందుకేశూన్యంలోకి చేతులు జోడించి, చెంపలు వాయించుకుంది సుందరమ్మ రఘురు ఇలాంటవి మరిచి పోవడానికి మంచి మందు దొరికింది.

## 31

సుశీలమ్మ ఆనందం అంతా ఇంతా కాదు. ఆమె సరాసరి కాంతమ్మ దగ్గ రకు వచ్చింది.

"అక్కయ్యా! ఉదయ్‌కు యాభై వేలతో పిల్లను ఇస్తారట."

"సంతోషమేగా?"

"అంత ముక్తసరిగా అంటున్నావు! అవునులే నీ కొడుక్కు కట్నం రాలే దుగా. అదే కుళ్ళు. అందుకే విష్ణు ఆ



ఆమె రాచరిక
సౌందర్య రహస్యం

# ఐటెక్స్

సౌందర్య సాధనములు

ముప్పై సంవత్సరములకు పైగా
ప్రసిద్ధి చెందిన సౌందర్య పరికరాలు




**Aravind Laboratories**
MADRAS-33

బడిపంతులు జగన్నాధం కూతుర్ని చేసుకోమన్నాడట."

- "అమ్మాయి చదువుకుంది, బుద్ధి మంతురాలని అన్నాడేమో."

"ఇష్టం లేదని చెప్పరాదు."

"నా కెందుకు ఇష్టం ఉండదే. మ పిల్లలకు ఇచ్చేరోజు యెంత గోలఅవుతుందోనని."

"నా పిల్లలతో మీకేం పోలిక!" అన్నది తీవ్రంగా. "ఇన్నాళ్లు నీకొడుకు నిరంకుశత్వం భరిస్తూ, బానిసల్లా బ్రతికాము నాకొడుకు ప్రయోజకుడయ్యాడు. మనుష్యుల్లా బ్రతుకుతాం."

"సుశీలా! నీకు 'నీ' 'నా' అని భేదం ఉందేమో, నా కెప్పుడూ లేదు. విష్ణూ, ఉదయ్ నా బిడ్డలే." అన్నది జేవురించిన ముఖంతో. సుశీలమ్మ మూతి తిప్పింది.

"మాటలకేంలే. నా కొడుకు సంపాదనాపరుడయ్యాడని ఈ నాడు ఇలా మాట్లాడుతున్నావు." అన్నది.

ఇలాంటి భావనలు, తనకు, తన భర్తకే ఉంటే..." ఆలోచించలేక పోయింది.

"అక్కయ్యా! నీ కొడుకు స్వార్థపరుడు. నా కొడుకు వివాహవిషయంలో అతని పెత్తనం అనవసరమని చెప్పు."

"ఎంతమాట అంటున్నావే. వాడా స్వార్థపరుడు! సుమతి పురుడు హాస్పటల్లోకాక ప్రయివేటు హాస్పటల్లో పోసుకుంటే యెనిమిది వందలు పోశాడు. వాడి పెళ్ళాం మొగాడిలా పనిచేసినా, క్లుప్తంగా మూడు రూపాయలతో పురుడు ముగిసింది. వాడే స్వార్థపరుడయితే తన కొడుకు నామకరణోత్సవం అంత క్లుప్తంగా చేస్తాడటే!"

"ఎవడికి తెలయని భాగోతం! అత్తగారింటి వారు దరిద్రులని "

"అంతేలే." మాటలు త్రుంచేసి, గదిలోకి వెళ్ళింది. కోడలు విన్నదేమో అనుకుంది. అత్తగారి గదిలో పడుకుంటుంది సుజాత. అప్పటికే పిల్లలూ, సుజాత నిదురబోయారు. రేణు, రమలు కమలమ్మ దగ్గర పడుకుంటారు. కాంతమ్మ మనుమడి పడక తడిఅయిందేమో చూచింది. తండ్రి పేరు కలిసి వచ్చేలా శ్రీరామ్ అని పేరు పెట్టాడు విష్ణు. శ్రీరామ్‌ను తన పక్కనే వేసుకుని పడుకుంది.

( స శే షం )

Printed and Published by A. Sudhakara Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press Hyderabad-500001. Controlling Editor: "CHAKRAPANI"

